EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: ***SHAPE SHIFTER***-GREEN APPLE, ***SPEED***-MANGO, ***FLIGHT***-ORANGE, ***GIANT***-WATERMELON, ***STRENGTH***-RASPBERRY, ***SHRINK***-LYCHEE, ***INVISIBLE***-PINEAPPLE, ***STRETCH***-MUSK MELON, ***FISSION***-BLACK CURRANT, ***FORCE FIELD***-GUAVA.

***RECAP:*** RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHAN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, ***A POWERFUL GADGET*** WITH ***10 POWERS.***

PARLE

POPPINS

Doon Kya?

# Ram and Shyam

## బ్లాక్ హోల్

## పార్ట్ 2

ఈ అద్భుతమైన శక్తిని అన్‌లాక్ చేసే రహస్యం తెలుసుకొనుటకు
http://www.parleproducts.com/brands/parlepoppins
మరియు www.chandamama.com//parle/index.php?pHcid=11

జరిగిన కథ: బ్లాక్ హోల్ నుండి పడిపోయిన తర్వాత, రాము - శ్యాము, తమ డెకాట్రిక్స్‌ని పోగొట్టుకున్నారు మరియు 5 ఏళ్ళు గడిచిపోయాయి. వాళ్ళు పృథ్విని కాపాడటానికి ప్లానెట్ బెల్లాట్రిక్స్‌పై కాలుపెట్టారు.

ఏంజెల్‌తో సహా తమ కొత్త అవతారాన్ని తెలియపరుస్తూ ప్లానెట్ బెల్లాట్రిక్స్‌పై అడుగుపెట్టారు.

డెకాట్రిక్స్‌ని మరియు మన హోమ్ ప్లానెట్‌నిపై మన హక్కుని తిరిగి పొందే సమయం వచ్చింది.

ఇంకా బెల్లాట్రిషియన్స్‌కు గుణపాఠం నేర్పాలి.

బెల్లాట్రిషియన్స్ వర్క్‌షాప్

ఈ ఆయుధాలని చూడు

డెకాట్రిక్స్ ఉండగా ఇన్ని ఆయుధాలని తయారుచేయడంలో వారి ఉద్దేశ్యం ఏమిటో?

వాళ్ళకి ఇద్దరు బెల్లాట్రిషియన్స్ మాట్లాడుకోవడం వినిపించింది.

5 ఏళ్ళ తర్వాత ఇప్పటికి మనం సిద్ధంగా ఉన్నాము.

డెకాట్రిక్స్ వల్ల ఉపయోగం లేదు. అది ఎలా పని చేస్తుందో కూడా మనకి తెలీడం లేదు

అది స్టోర్ రూంలోనే పడిఉండని.

వాళ్ళ వద్ద పాపిన్స్ లేనపుడు దాని శక్తిని అన్‌లాక్ ఎలా చేయగలిగారు?

డెకాట్రిక్స్‌ని పిలుద్దాం, వాళ్ళని తీసుకుని కిందికి వెళ్ళిపోదాం

ఇద్దరూ తమ చేతులని ముందుకు చాచారు, డెకాట్రిక్స్‌ని పిలిచారు. డెకాట్రిక్స్ మెరుస్తూ ఆకాశంలో ఒక్కసారిగా ఎగసిపడుతూ వారి చేతులకు చుట్టుకుంది.

బ్లాక్ హోల్ గుండా పడటం వల్ల డెకాట్రిక్స్ మరిన్ని శక్తులు వచ్చాయి.

కొత్త 'పవర్ ఆఫ్ ఐస్'తో ప్రతి ఒక్కరినీ మంచులా గడ్డకట్టేలా చేయసాగారు.

రామ్ స్నో రేస్‌ని తన చేతుల మీదుగా విడుదల చేస్తున్నాడు, ఇంకా శ్యామ్ ఐస్ మెటియోర్స్‌లో వాడే వారి పరికరాలని ధ్వంసం చేస్తున్నాడు.

బెల్లాట్రిషియన్స్ ఓడిపోయారు ఇక భూమి సురక్షితంగా ఉంది. రాము మరియు శ్యాము... ఇంకా పార్లే పాపిన్స్‌కు అందరూ ధన్యవాదాలు చెప్పుకున్నారు.

POPPINS

www.chandamama.com/parle/

# యువ విజేతలు



మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా యువ విజేతగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## అంచనాలకు మించిన ప్రతిభ

కెనడాలో, స్వచ్ఛంద సేవా రుణ అవసరాలున్న గ్రాడ్యుయేట్ విద్యార్థులకు స్వచ్ఛంద సేవలో గడపటం అవసరం. పద్నాలుగేళ్ల హార్నూర్ గిల్ ఇప్పటికే వెయ్యి గంటల కంటే ఎక్కువగా సేవా కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. మూడేళ్లప్రాయంలో అతడు సేవా కార్యక్రమాలు ప్రారంభించాడు. చిల్డ్రన్స్ ఎయిడ్ సొసైటీ, అమేజింగ్ కిడ్స్ వంటి పలు చారిటీ సంస్థలకు ఇతడు సేవలందించాడు. ఇటీవలే తన స్వంత చారిటీని ఇతడు ప్రారంభించాడు. దానిపేరు ది జీన్ గ్రీన్ డ్రైవ్ ఛారిటీ. కొత్త, వాడిన జీన్స్‌ని ఇతడు సేకరించి తన పరిసర ప్రాంతంలో ఉన్న, విదేశాల్లో ఉన్న ఛారిటీలకు పంపిస్తుంటాడు. ప్రజలను సుఖ సంతోషాలతో ఉండేలా చేయాలనేది హార్నూర్ ప్రధాన లక్ష్యం. తన వాలంటరీ సేవల ద్వారా నాయకత్వ కౌశలాలను సాధించవచ్చని ఇతడి విశ్వాసం. వాలంటరీ సేవలకు వయసు అడ్డంకి కాదని ఇతడు చూపించదలిచాడు. వెబ్‌లో వాలంటరీ సేవలను వెదికి పట్టుకుని మీ కమ్యూనిటీకి సహాయం చేయవలసిందిగా ఇతడు పిల్లలకు బోధిస్తుంటాడు. పాఠశాలలో లెక్కలు, సైన్స్ ఇతడి అభిమాన అంశాలు. సముద్ర జీవ శాస్త్రవేత్తగా మారాలన్నది తన ఆకాంక్ష. భవిష్యత్తులో సముద్ర జీవశాస్త్ర వాతావరణంలో పనిచేస్తూంటానని తన ఛారిటీ పనిని, వాలంటీర్ సేవలను కూడా కొనసాగిస్తానని ఇతడు చెబుతున్నాడు.



October 2012 ₹25/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**General Manager :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Customer Help :**
Ph: 022 40786043
customerhelp@chandamama.com

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Mulekar
Published At : B-3, Lunic Industries, "B" Cross Rd, Opp.SBI, MIDC, Andheri (E), Mumbai - 400 093.
Printed At :- Mothers Graphics (I) Pvt. Ltd. 91D, Govt. Ind. Estate, Charkop, Kandivali (W), Mumbai - 400 067.
Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 October 2012 Issue-10

# మహాత్ముడి స్మరణ...

గత సంవత్సరం అక్టోబర్ సంపాదకీయంలో, మన కళ్లముందు జరుగుతున్న చరిత్రకు సాక్షీభూతంగా ఉండటం గురించి పేర్కొన్నాను. అయితే ఒకే ఒక్క సంవత్సరంలో జరిగిన ఘటనలు, మనందరినీ ఏదైనా దైవ జోక్యం కోసం ఆకాశంకేసి చూసేలా చేశాయి. గత సంవత్సరం పతాకస్థాయికి చేరిన ఉద్యమం పలు కారణాలవల్ల భగ్నమైనట్లు కనిపిస్తోంది. ఈ రకమైన వెనుకంజలు మన సంకల్పాన్ని బలోపేతం చేయాలి. అంతే కాని మన మనోధైర్యాన్ని భంగపర్చ రాదు.

ఈ నెలలో మనం దసరా జరుపుకుంటున్నాము. మనం నేర్చుకోవడానికి సంబంధించి ఇదొక యోగ్యమైన ఉదాహరణ. శ్రీరామచంద్రుడు తన సంకల్ప మాత్రం చేత, తన సైన్యం అందించిన సహాయం చేతనే మహా బలవంతుడైన రావణుడిని ఓడించగలిగాడు. ఈ స్ఫూర్తితోనే, అసమర్థత, అవినీతి, ఆకలిద ప్పులు, నిరక్షరాస్యత వంటి రాక్షసులతో పోరాడి, మన దేశాన్ని పురోగమింపచే యడానికి మనందరం కలిసి ముందడుగేయాలి.

యాపిల్ యాప్ స్టోర్‌లో మన పత్రికకు వస్తున్న స్పందనతో ఉత్తేజం పొందిన మేము మా కాఫీ టేబుల్ బుక్, రామాయణం పుస్తకాలను కూడా యాప్ స్టోర్‌లో ప్రవేశపెట్టాము. వీటిని ఆండ్రాయిడ్, మైక్రోసాఫ్ట్ విండోస్ 8.0 ప్లాట్ ఫామ్‌పై ప్రారంభించే క్రమంలో ఉన్నాము. మా పాఠకులు వీటిని కూడా ఆస్వా దించగలరని, దశాబ్దాలుగా చేస్తున్నట్లుగానే చందమామను ఆదరించడాన్ని కొనసాగిస్తారని మేము భావిస్తున్నాము.

– సంపాదకులు





# పాఠకుల లేఖలు



చందమామ పలు భాషలలో లభ్యం కావడం గొప్ప విషయం. ఇది భారతీయ పిల్లల పత్రికలలో అతి పురాతమైనది. చందమామ కథలు నేరుగా హృదయాన్ని స్పర్శిస్తాయి. నా జీవితాంతం దీన్ని చదువుతూ ఉంటానని చెప్పగలను. – శుభ్‌దీప్, జార్ఖండ్

చందమామ కథలు మొదట మా తాతగారు చెప్పేవారు. తర్వాత మా అమ్మా నాన్నా నన్ను కథ చెప్పి మరీ పడుకోబెట్టేవారు. ఇప్పుడు నేను కథలు చదివి మా తమ్ముడికి చెబుతున్నాను. రావికొండలరావు తాతగారు వ్రాసిన చందమామతో అనుభవాలు బాగున్నాయి. మాతాతగారు ఇప్పటికీ అంటారు. సరిలేరు చందమామ కెవరూ అని. బేతాళ కథలు అంటే దయ్యం కథలుగా అనుకునేదాన్ని. కాని నేను స్వయంగా కథలు చదువుతుంటే చాలా బాగుంటున్నాయి. జూలై చందమామ కవర్ పేజీ ఎంతో ఆకట్టుకుంది. బీర్బల్ కథలు బొమ్మలతో సహా ఇస్తున్నందుకు మంచి కథలతో, విజ్ఞానదాయకమైన విశేషాలతో చందమామను అందిస్తున్నందుకు కృతజ్ఞతలు. – పులిజాల శ్రద్ధ, హైదరాబాద్

చందమామ 66న వార్షికోత్సవ సంచిక ముఖచిత్రం పరిశీలిస్తే, జూలై 1, 1947 నుండి జూలై 1, 2012 నాటికి చందమామ 6 అణాల నుండి 25 రూపాయల వరకు ధర పెరిగింది. సంపాదకీయంలో మీరు విజ్ఞప్తి చేసిన ధర పెంపు గురించి ఆక్షేపణ ఏమీ లేదు. 25 రూపాయలు పెరిగినా ఎవరూ బాధపడరు. అప్పటికీ, ఇప్పటికీ చందమామ ఉత్తమ ప్రమాణాలు ఏ పత్రికా అందుకోలేదు. కథ చదవగానే ఆఖరిలో ఎంత రిలీఫ్ వస్తుందో చెప్పలేము. పోటో వ్యాఖ్యల పోటీ పునఃప్రారంభించండి. అది మెదడుకు మేత కాగలదు.
– బి. రాజేశ్వరమూర్తి, కృష్ణా జిల్లా

ఇటీవలి చందమామ సంచికను అందుకున్నప్పుడు, చాలా సంవత్సరాల తర్వాత పాత చందమామను చూస్తున్నట్లనిపించింది. నాకు చాలా సంతోషంగా ఉంది. ప్రతి కథా ఎంత గొప్పగా ఉందంటే ఏ కథ మిగతా వాటి కంటే మంచి కథ అని తేల్చుకోలేకపోయాను. పాత, కొత్త కథలు ఇప్పుడు నిజంగానే పోటీపడుతున్నాయి. చందమామను దశాబ్దాలుగా చదువుతున్న కుటుంబం మాది. మా పాత చందమామను మళ్లీ మాకిస్తున్నందుకు మీకు వేనవేల కృతజ్ఞతలు. – జి శ్రీనివాస్, హైదరాబాద్

చందమామ గత వైభవాన్ని కథలు ఇప్పటికీ కొనసాగిస్తున్నాయి కాని పాత చిత్రాలతో పోలిస్తే కొత్త చిత్రాల నాణ్యత నాలాంటి చిత్రకారులకు అసంతృప్తి కలిగిస్తోంది. చందమామ తాజా సంచికలో కూడానాణ్యమైన చిత్రాల కొరత స్పష్టంగా కనిపిస్తోంది.
– ఎం.వి.వి. శాస్త్రి, మచిలీపట్నం, ఎ.పి.

1957 నుంచి చందమామ పాఠకుడిని. అప్పట్లో పత్రిక ధర 37 పైసలు. సీరియల్స్‌ని మీరు తిరిగి ప్రచురిస్తున్నారు కాని రూపధరుడి యాత్రలు సీరియల్‌ని పునఃప్రచురించలేదు. శిథిలాలయం పూర్తి కాగానే ఈ సీరియల్‌ని ప్రచురించగలరు. – ఎస్.జనార్దన్, బెంగళూరు

# వెండిదీపంకుందె!

హేలాపురి న్యాయాధికారి సమక్షంలో, ఒక వెండి దీపంకుందె దొంగతనం గురించి విచారణ జరుగుతున్నది. కుందె పోగొట్టుకున్న కేశవుడు, ''అయ్యా! ఆ రోజు శ్రావణ శుక్రవారం. నా భార్య వ్రతం చేసుకుంటూ ముత్తయిదువులను పేరంటానికి పిలిచింది. వ్రతం పూర్తయి పేరంటాళ్ళందరూ వెళ్ళిపోయాక చూసుకుంటే, అప్పుడు తెలిసింది దొంగతనం జరిగిన విషయం. ఆ దొంగిలించింది ఎవరో కాదు, మాధవుడి భార్య గుణవతి, ...'' అంటూ ఇంకా చెప్పబోతూంటే- న్యాయాధికారి మధ్యలో అడ్డుపడి, ''అయితే, ఆ కుందె దొంగిలించింది మాధవుడి భార్య గుణవతి అని ఎలా అనుమానించావు?'' అని అడిగాడు.

''అయ్యా! వారం రోజుల క్రితం గుణవతి ఇంట్లో జరిగిన శుభకార్యానికి, నా భార్య కూడా వెళ్ళింది. అప్పుడు పూజలో పెట్టబడివున్న, మా వెండి దీపంకుందెను, నా భార్య గుర్తించింది. దయచేసి దాన్ని మా కిప్పించండి,'' అన్నాడు కేశవుడు.

''అది మీదే అనడానికి గట్టి ఆధారం ఏమిటి? వెండి దీపంకుందెలు ఎన్ని ఇళ్ళల్లో లేవు!'' అంటూ ప్రశ్నించాడు, న్యాయాధికారి.

''అయ్యా! మా దీపంకుందె ఓం ఆకారంలో వుంటుంది,'' అన్నాడు కేశవుడు.

''అలాగా!'' అంటూ న్యాయాధికారినవ్వి, ''ఆ మాటకొస్తే, మా ఇంట్లోనూ ఓం ఆకారంలో వున్న దీపపుకుందె వున్నది,'' అన్నాడు.

''అయ్యా! ఆ విషయమే తమకు మనవిచేయబోయాను. తమరు అవరోధం కలిగించారు. వ్రతం రోజున మా ఇంట్లో దొంగిలించిన ఓం ఆకారపు దీపపు కుందెను, మాధవుడి భార్య తెలివిగా తమ భార్యగారికే అమ్మిందని తెలిసింది. ఇప్పుడది వాళ్ళింట్లోలేదు. తమ ఇంట్లోనే ఉంది,'' అన్నాడు కేశవుడు.

అది విన్న న్యాయాధికారితో పాటు, అక్కడవున్న వాళ్ళందరూ నివ్వెరపోయారు.

– కోనేనాగవెంకట ఆంజనేయులు



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 11 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ...............................................................................................

Date of Birth: .................................. Sex :......................................

Address: ..........................................................................................

.........................................................................................................

.........................................................................................................

...................................................... City: .........................................

State:........................................ Pin:..............................................

Telephone:........................................................................................

Mobile:.............................................................................................

Email:...............................................................................................

Subscription Number (for renewals):..............................................

Gift Subscription to the following address:

.........................................................................................................

.........................................................................................................

.........................................................................................................

.........................................................................................................

Enclosed Cheque/DD* for Rupees.................................................

Cheque/DD No ...............................................................................

favouring Chandamama India Ltd on...........................................

...............................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 30/- per copy) | Rs. 360 | Rs. 645 | Rs. 915 | Rs. 1150 | Rs. 1350 |
| You Save | | Rs. 75 | Rs. 165 | Rs. 290 | Rs. 450 |
| REGIONAL (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 260 | Rs. 375 |
| JUNIOR (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 765 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 195 | Rs. 300 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు - తెలుగు

నేను వృత్తిరీత్యా గ్రామ పంచాయితీలకు క్యాంపు వెళ్లేవాడిని. నా వయస్సు అప్పుడు 26 సంవత్సరాలు.

రైల్వే కోడూరు పంచాయితీ ఆఫీసులో క్యాంపు చేస్తున్నాను. పంచాయితీ ఆఫీసు ప్రక్కనే పిల్లల లైబ్రరీ ఉంది. ఆరోజు ఆదివారం నేనూ లైబ్రరీలోపలికి వెళ్లాను. ఒక బెంచీ వద్ద ఐదారుగురు పిల్లలు ఏదో ఒక పత్రికకు గాను ఆత్రుతతో చదువుతున్న బాలుడి పక్కనే కూర్చున్నారు. కొంత కాలానికి ఆ పత్రికను నేనూ చూడాలని అనిపించి తీసుకున్నాను. అదే మనందరి ప్రియతమ చందమామ! అందులోని కథలు శీర్షికలు అన్నీ చదివేదాక ఉండలేకపో యాను. అప్పుడే నేను కథలు రాసేవాణ్ణి. చందమామకు రాయాలనిపించింది. మరుసటిరోజే ఒక చిన్న కథ రాసి చందమామకు పంపాను.


Name: Kolar Krishna Iyer
Occ: Retd. District Audit Officer, Tirupati.

ఆ కథ పేరు 'చెడుమార్గం' అనుకుంటాను. ఆ కథ సారాంశం ఇలా ఉంది. ఒక బాలుడు దొంగతనం చేస్తుండగా పట్టుబడి చెరసాలకు వెళ్లి బయటకొస్తాడు. అప్పుడు ఆ గ్రామస్తులందరూ వాడు ఎక్కడికి వెళ్లి ఏ పనికో అడుక్కున్నా, ఛీ దొంగ వెధవా, దొంగ వెధవా వెళ్లు అని ఛీకొట్టి పంపించేసేవారు. అప్పుడు వాడికి జ్ఞానోదయం అయింది. ఒకసారి చెడుమార్గంలో వెళ్ళి మచ్చ తెచ్చుకొన్న తర్వాత దానిని మాన్పించడం అసాధ్యం అని తెలుసుకుని ఆ గ్రామం వదిలి వేరే గ్రామంలో మంచి మార్గంలో నడుస్తూ జీవిస్తాడు. అప్పుడు చందమామ సంపాదకులు రచనలు అంగీకరించింది లేనిదీ వెంటనే కార్డు ద్వారా తెలిపేవారు. నా కథ అంగీకరించినట్లు ఒక వారంలోగా తెలిసేది. ఆ కార్డును చదివినప్పుడు కలిగిన సంతోషం తలుచుకుంటే మరీ సంతోషం పట్టలేకవస్తూంటుంది ఇప్పుడూ.

అప్పటినుండి తరచుగా కథలు పంపేవాణ్ణి. నా అదృష్టం చాలా కథలు నావి చందమామలో చోటు చేసుకున్నాయి. ఫిబ్రవరి 2011 సంచికలో నా పాత కథ 'బంగారయ్య ఆస్తి' పాఠకులు చదివే ఉంటారు. మూడునెలల నుంచి నా కథలు చోటు చేసుకోవడం నాకెంతో సంతోషంగా ఉంది. నిజం చెప్పాలంటే చందమామలో కథ పడిందంటే గ్రేట్ కదూ, చందమామ సూపర్ పాపులారిటీ అందుకోవడానికి కారణాలు అనేకం.

1. అద్భుతమైన మనోహరమైన జానపద మరియు మరియు పౌరాణిక సీరియల్స్.
2. భావగర్భితమైన ఒక పేజీ కథలు.
3. 25 ఏండ్లనాటి కథలు. ఆకర్షణీయమైన కనులకు ఇంపుగా ఉండే కథలకు అనుగుణంగా వేసిన రంగురంగుల చిత్రాలు.

5. ఒకటి రెండు విదేశీ కథలు, ఇంతకు ముందు ఫోటో వ్యాఖ్యల పోటీ వేసేవారు. అది చాలా పాపులర్ శీర్షిక. మళ్లీ వేస్తే బాగుంటుంది.

చందమామ పత్రిక లేని గృహమే ఉండకూడదని ఆశిస్తున్నాను.

## చందమామతో నా జ్ఞాపకాలు - మరాఠి



Name: D.T. Nandapure
Occ: Retd. Principal,
Loni, Maharashtra.

నాకిప్పుడు 76 సంవత్సరాలు. 50 సంవత్సరాల క్రితం 1961లో నాకు హైస్కూల్ ప్రధానోపాధ్యాయుడిగా ఉద్యోగం లభించింది. ఆ కాలంలో, ప్రాథమిక పాఠశాలలో మాకు చందమామ మరాఠీ సంచిక చందోబా వచ్చేది. అది మద్రాస్‌లో ప్రచురించబడేది. మహా రాష్ట్రకు ఎంతో దూరంలో ఉండే తమిళనాడులో, మరొక భాషా ప్రాంతంలో మరాఠీ సంచిక ప్రచురించబడటమే ఒక అద్భుతం. చందోబాను నేను క్రమం తప్పకుండా చదివేవాడిని. అన్ని కథలూ రంగుల్లో ఉండేవి. పత్రికలో చిత్రాలు జీవం ఉట్టి పడుతూ మంత్రముగ్ధులను చేసేవి. నేను చందోబా పత్రికను గ్రంథాలయం నుంచి తీసుకునేవాడిని. ఏడెనిమిది రోజుల తర్వాత దాన్ని తిరిగి ఇచ్చేసేవాడిని. అంత ఆసక్తికరమైన, అరుదైన కథలకు ఆధారం ఏమిటని నేను ఆశ్చర్యపడేవాడిని. చిత్రాల సేకరణ కూడా అద్భుతంగా ఉండేది. అందుకే ఇప్పుడు వృద్ధాప్యంలో కూడా నేను అదే ఆసక్తితో చందోబాను చదువుతుంటాను. చందోబాలో చాలా కాలం క్రితమే ప్రచురితమైన ప్రపంచంలోని ఏడు వింతలను నేను పంపుతు న్నాను. నా స్నేహితులు చాలామంది చందోబాలో చక్కటి సమాచారం ఉందని, జ్ఞానదాయకంగా ఉందని చెప్పేవారు. చందోబా నిజంగా చాలా మంచి పత్రిక. ఇప్పు డిది ముంబైలో, మా మహారాష్ట్రలోనే ప్రచురించబడుతుండటం చాలా సంతోషాన్ని కలిగిస్తోంది. చందోబాకు నా శుభాకాంక్షలు.

## చందమామతో నా జ్ఞాపకాలు - తెలుగు



Name: Y. Suvarnakala
Hyderabad, A.P.

నా వయస్సు 60 సంవత్సరాలు. ఊహ తెలిసినప్పటినుంచి నాకు చందమామ తెలుసు. ఇప్పటికీ చందమామ నా చేతిలో పడిందంటే చాలు. పుస్తకం మొత్తం చదవందే వదలను. అయితే నేను చదివే విధానం గమ్మత్తుగా ఉంటుంది. వెనక పేజీ నుంచి మొదలు పెట్టి ముఖచిత్రంలో ముగి స్తాను. నాకు పది సంవత్సరాల వయసు గల మనవడు న్నాడు. వాడు కథ చెబితే గాని నిద్రపోడు. రోజుకో కథ చెప్పాలి. అలాంటప్పుడు అనిపిస్తూ ఉంటుంది. చందమామ నెలకొకటేనా అని.

## బేతాళ కథలు

# విరాజుడి వైరాగ్యం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి ఎప్పటిలాగే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు.

అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా! జీవితంలోని భోగాలపట్ల, పదవుల పట్ల కొందరు కొన్ని సార్లు వైరాగ్యం ప్రదర్శిస్తారు. కాని చివరకు వచ్చేసరికి వాటిని దొరకబుచ్చుకుని అసంగతంగా ప్రవర్తిస్తారు. నీవు ఆ కోవకు చెందిన వాడివేమో ఆత్మపరిశీలన చేసుకోవడానికి వీలుగా, ఆట్లా ప్రవర్తించిన విరాజుడి కథ చెబుతాను విను,' అంటూ ఇలా చెప్ప సాగాడు.

మాళవిక రాజ్యం రాజు విచిత్ర వీరుడు ధర్మప్రభువు. అతనికి చాలా కాలం సంతానం కలగలేదు. రాజదంపతులు ఎన్నో పూజలు, యాగాలు చేసారు. ఎందరో యోగులను కలిశారు. చివరికి దైవం కరుణించి మహారాణి గర్భం దాల్చింది. ఒక



శుభముహూర్తాన పండంటి బిడ్డను ప్రస వించింది. రాజదంపతులు పుత్రోత్సా హంతో పండుగ జరిపారు.

పుట్టిన బిడ్డకు విరాజుడు అని నామకరణం చేసి అల్లారు ముద్దుగా పెంచారు. అయితే విరాజుడికి చిన్న నాటి నుంచి వైరాగ్య భావాలు ఎక్కు వగా ఉండేవి. పిల్లలతో కలిసి ఆడేవాడు కాడు. ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తూ సమయం గడిపేవాడు.

మహారాజు, విరాజుడిని గురుకులా నికి పంపాడు. విరాజుడు సకలవిద్యలు అభ్యసించాడు గాని, వాటి పట్ల ఆసక్తి కనబరిచేవాడు కాదు.

విచిత్రవీరుడు వృద్ధుడయ్యాడు. తన పరిపాలన సవ్యంగా లేదని గ్రహిం చాడు. అందుకే యువకుడైన కుమా రుడికి పట్టాభిషేకం జరిపి, రాజ్యపాలనా భారం అప్పగించి, తను విశ్రాంతి తీసు కోవాలని భావించాడు.

అదే విషయం కుమారుడితో చర్చిం చాడు. అయితే విరాజుడు పట్టాభిషేకం పట్ల ఎటువంటి ఆసక్తి చూపక, 'తండ్రీ! ఈ రాజభోగాల పట్ల నాకు ఆసక్తి లేదు. అడవులకు పోయి తపస్సు చేసుకోవా లని ఉంది,' అని చెప్పాడు.

అది విన్న విచిత్ర వీరుడు ఖిన్నుడ య్యాడు. 'నాయనా! నీవు రాజపుత్రు డివి. రాజ్యపాలన నీ కర్తవ్యం. అడవు లకు పోయి తపస్సు చేయవలసిన వయస్సు కాదు నీది,' అని చెప్పి చూశాడు.

అయితే విరాజుడి పట్టాభిషేకానికి సమ్మతించలేదు.

సుదీర్ఘంగా ఆలోచించిన విచిత్రవీ రుడు, విరాజుడితో 'నాయనా! జరగ నున్నది జరగకమానదు. నీవు కొంత కాలం దేశ సంచారం చేసిరా! అప్పటికీ నీకు పరిపాలన పట్ల విముఖత ఉంటే, నీ ఇచ్ఛ ప్రకారం అడవికి పోయి తపసు చేసుకుందువుగాని,' అని చెప్పాడు.

అందుకు సమ్మతించిన విరాజుడు, ఒక సామాన్యుడిలా వేషం మార్చుకుని ఒంటరిగా దేశసంచారానికి బయలు దేరాడు.

కొంతదూరం ప్రయాణించాక, ఒక రాత్రి అతనొక రైతు ఇంట బస చేశాడు. తనకు ఆతిథ్యమిచ్చిన రైతు దంప తులు దిగులుగా ఉండటం గమనించిన

విరాజుడు 'అయ్యా! నాకు ఆతిథ్యమిచ్చిన పుణ్య దంపతులు మీరు. మీరెందుకో దిగులుగా ఉన్నట్లు తోస్తుంది. కారణం తెలుపండి,' అని కోరాడు.

అప్పుడా రైతు, 'నాయనా! చేతికొచ్చిన పంట అకాలవర్షం వలన కొట్టుకుపోయింది. అప్పులే మిగిలాయి. రాజుగారిని కలిసి మా గోడు వెళ్లబుచ్చుకోవాసలంటే అధికారులు అడ్డంపడుతున్నారు.' అని బాధపడ్డాడు.

విరాజుడు వారితో 'నాకు రాజుగారిని కలిసేపాటి పరిచయం ఉంటుంది. అతనికి మీ బాధ తెలియబరుస్తాను. ధైర్యంగా ఉండండి,' అని ఓదార్చి అక్కడినుంచి బయలుదేరిపోయాడు.

కొద్ది రోజులు ప్రయాణించిన తర్వాత విరాజుడు, యజ్ఞనారాయణుడు అనే బ్రాహ్మణుడి ఇంట బస చేశాడు.తనకు ఆతిథ్యమిచ్చిన యజ్ఞనారాయణుడు పదే పదే భార్యను ఓదార్చడం గమనించిన విరాజుడు, 'ఏం జరిగింది?' అని వాకబు చేశాడు.

అందుకు యజ్ఞనారాయణుడు 'నాయనా! మాకు పెళ్లి కావలసిన ఆడపిల్ల ఉంది. ఆ పిల్ల పెళ్లికని పదివేల వరహాలు కష్టపడి దాచాను. వారం క్రితం దొంగలు పడి ఆ సొమ్ము దొంగిలించారు. ఇక పిల్ల పెళ్లి ఎలా చేయగలం? అని నా భార్య దుఃఖిస్తున్నది,' అని చెప్పాడు.

అది విన్న విరాజుడు 'మరి దొంగతనం గురించి కొత్వాల్‌కి ఫిర్యాదు చేయకపోయారా?' అని అడిగాడు.

అందుకు యజ్ఞనారాయణుడు, 'కొత్వాల్ దొంగతనం గురించి పట్టించుకోవాలంటే అతనికి కొంత లంచం ఇవ్వాలి. అంత ధనం నా దగ్గర లేదు,' అని బాధ పడ్డాడు.

అప్పుడు విరాజుడు 'అయ్యా, రాజు





గారి దగ్గర నాకు కాస్తంత పలుకుబడి ఉంది. మీ విషయం వారికి తెలియబరుస్తాను,' అని అక్కడినుంచి బయలుదేరాడు. మరికొంత దూరం ప్రయాణించిన విరాజుడు, వినీలరత్నుడు అనే ధనికుడి ఇంట బస చేశాడు.

వినీల రత్నుడి సేవకుడు, విరాజుడికి కమ్మటి భోజనం వడ్డిస్తూ 'అయ్యా! మా యజమాని పరమదయాళువు. గతంలో ఆయన రోజుకి వందమందికి అన్నదానం చేశాడు. పరిస్థితులు అనుకూలించక ప్రస్తుతం ఒకరిద్దరికి మాత్రమే అన్నదానం చేస్తున్నాడు,' అని చెప్పాడు.

అది విన్న విరాజుడు 'అన్నదానం మానడానికి కారణమేమిటి?' అని వాకబు చేశాడు. అప్పుడా సేవకుడు,' అయ్యా! రాజ్యంలో పన్నుల భారం పెరిగిపోయింది. అతని సంపదంతా పన్నులు కట్టడానికే హరించుకుపోతున్నది. అందుకే పూర్వంలా ఉదారంగా అన్నదానం చేయలేక పోతున్నారు,' అని వివరించాడు.

అది విన్న విరాజుడు 'మరి పన్నుల భారం భరించరానిదిగా ఉన్నదని మహారాజుకు మనవి చేయవచ్చును కదా!' అన్నాడు.

అందుకా సేవకుడు 'మహారాజు వృద్ధుడయ్యాడు. అందుకే ఎక్కువగా మంత్రుల మీద ఆధారపడుతున్నాడు. దొంగ బుద్ధులున్న మంత్రులు రాజుగారికి తెలీకుండా పన్నులు పెంచి దండుకుంటున్నారు. మహారాజుని ప్రజలు కలవకుండా అడ్డంకులు సృష్టిస్తున్నారు,' అని చెప్పాడు.

అప్పుడు విరాజుడు, 'మీ యజమాని వంటి దయాళువులు పది మంది ఉంటేనే ధర్మం వర్ధిల్లుతుంది. పన్నుల భారం గురించి రాజుగారికి నేను నివేదిస్తాను.' అని భరోసా ఇచ్చాడు.

కొద్ది రోజుల ప్రయాణం తరవాత విరాజుడికి, ఒక సన్యాసి తారసపడ్డాడు. అతను ఒక చెట్టుకింద కూర్చుని పది మందికి ధర్మబోధ చేస్తున్నాడు. విరాజుడు అక్కడ కూర్చుని అతని ధర్మబోధ విన్నాడు.

అందరూ వెళ్లిపోయాక సన్యాసి దరికి చేరి నమస్కరించి 'సన్యసించాక మీరెంతో సంతోషంగా ఉండి ఉంటారు,'

అవునా? అన్నాడు.

అందుకు సన్యాసి, 'అవును నాయనా! బాధ్యతలు అనే లంపటాలు వదిలించుకున్నాక జీవితమెంతో సంతోషంగా ఉంది,' అని చిద్విలాసంగా నవ్వాడు.

విరాజుడు ఆ సన్యాసి దగ్గర సెలవు తీసుకుని ముందుకు సాగాడు.

కొంత దూరం పోయాక విరాజుడికి ఒక పాక కనిపించింది. అక్కడ ఒక నడివయస్కుడు పదిమంది పిల్లలకు అన్నం వడ్డిస్తూ కనిపించాడు.

విరాజుడు, అతడిని సమీపించి 'ఎవరు నువ్వు? ఈ పిల్లలు నీ సంతానమా?' అని అడిగాడు. అందుకావ్యక్తి, 'అయ్యా, నా పేరు దయానందుడు. ఇక్కడున్న పిల్లల్లో ఇద్దరు మాత్రమే నా సంతానం. మిగిలినవారు అనాథలు. ఉన్నంతలో వీరందరి బాగోగులు చూస్తున్నాను,' అన్నాడు.

అప్పుడు విరాజుడు, 'నీ పిల్లల బాగోగులు చూడ్డమే ఈ రోజుల్లో కష్టం. అటువంటిది నీకేమీ కాని అనాథల కోసం ఆరాటపడటం లేనిపోని లంపటం కదా!' అని చెప్పాడు.

అందుకు దయానందుడు, 'అయ్యా! మనిషిగా సాటివారి బాగోగులు చూడటం నా బాధ్యత. అది లంపటం ఎలా అవుతుంది? ఇందులో నా కెంతో ఆనందం దక్కుతున్నది.' అని చెప్పాడు.

కొద్ది క్షణాలు ఆలోచించిన విరాజుడు, దయానందుడికి నమస్కరించి



'నీ జన్మ ధన్యం,' అని అక్కడినుంచి బయలు దేరి అంతఃపురం చేరాడు.

తండ్రిని కలిసిన విరాజుడు, 'శుభ ముహూర్తం చూడండి. నేను సింహాసనం అధిష్టిస్తాను,' అన్నాడు.

విచిత్ర వీరుడు, కుమారుడి వంక కాస్సేపు సంతృప్తిగా చూసి 'శుభం,' అన్నాడు.

సింహాసనం అధిష్టించిన విరాజుడు అధికారుల ఆగడాలను అదుపులో పెట్టాడు. లంచగొండులను కఠినంగా శిక్షించాడు. దొంగలను చెరసాలలో పెట్టించాడు. పన్నుల భారం తగ్గించి ప్రజలందరి మన్ననలను పొందాడు.

అంతవరకు కథ చెప్పిన బేతాళుడు 'విక్రమార్కా! విరాజుడి చిన్నతనం నుంచి వైరాగ్య భావాలతో పెరిగాడు. పట్టాభిషేకానికి విముఖతం చూపిం

చాడు. అటువంటివాడు ఉన్నట్లుండి దేశాటనం తర్వాత సింహాసనం అధిష్ఠించడానికి సమ్మతించడానికి కారణమేమిటి? ఒకప్పుడు భోగం అనిపించిన రాజరికం ఇప్పుడు అలా అనిపించలేదా! లేక వాటి పట్ల ఇష్టం పెంచుకున్నాడా? దేశాటనంలోని ఏ సంఘటనలు అతనిలో మార్పు తెచ్చాయి? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీ తల వేయి ముక్కలవుతుంది,' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, 'బేతాళా! విరాజుడు సింహాసనం భోగమని తొలుత భావించాడు. కానీ దేశాటనం చేసిన తర్వాత రాజు ఉన్నది భోగాలు అనుభవించడానికి కాదని, ప్రజల కష్టాలు తీర్చడానికి, సేవలు చేయడానికని గుర్తించాడు.

రాజు అనేవాడు అధికారులను అదుపులో పెట్టాలి. లంచగొండులను శిక్షించాలి. దొంగలను చెరలో పెట్టాలి. ప్రజలకు కూడు, గుడ్డలకు లోటు లేకుండా చూడాలని అర్థం చేసుకున్నాడు. అతనికి తారస పడిన సన్యాసి బాధ్యతలను లంపటాలుగా భావిస్తే, ఒక సామాన్యుడు మాత్రం అనాధలకు అన్నం పెట్టడం స్వధర్మంగా భావించాడు. ఒక సామాన్యుడే అంత బాధ్యతాయుతంగా వ్యవహరించినప్పుడు, రాజకుమారుడైన తను బాధ్యతల నుంచి తప్పుకోవడం ధర్మం కాదని గ్రహించడంతో అతడికి జ్ఞానోదయం అయింది. అదే సింహాసనం అధిష్ఠించడానికి సుముఖత చూపేలా చేసింది.

వైరాగ్యం విరాగికి మాత్రమే ఆనందాన్నిస్తుంది. బాధ్యత స్వీకరించడం అనేది పదుగురి సంతోషానికి కారకం అవుతుంది. వైరాగ్యానికి, బాధ్యతకు ఉన్న తేడా గ్రహించబట్టే విరాజుడు పట్టాభిషేకానికి సమ్మతించాడు,' అని సమాధానమిచ్చాడు.

రాజుకీవిధంగా మౌనభంగం కలుగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)

(ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు)





# మంచిపని

శ్రీను, బాలు అన్నదమ్ములు. వాళ్లు వేసవి సెలవులకు తాతగారి ఇంటికి వచ్చారు. ఒకరోజు తాతగారు ఇద్దరిని పిలిచి 'అలా పొద్దస్తమాను టీవి చేసే బదులు ఇంటికి ఉపకరించే పని ఏదైనా చేయండిరా,' అన్నారు.

బాలు మర్నాడు ఉదయం లేచిన వెంటనే అన్నయ్య శ్రీను కోసం చూశాడు. అన్నయ్య తన కంటే ముందే నిద్రలేచి తోటలో పనిచేయడం చూసి నాలుక కరుచుకున్నాడు. 'అన్నయ్య తన విశ్వ రూపం తాతగారికి చూపిస్తున్నాడన్న మాట. ఇక లాభం లేదు, నేను కూడా ఏదో ఒకటి చేసి తాత గారి మెప్పు పొందాలి,' అనుకున్నాడు.

బాలు ఇంట్లో పేరుకుపోయిన పాత పేపర్లను, కొన్ని పాత పుస్తకాలను మూట గట్టి వీధి చివరన ఉన్న పున్నయ్య కిరాణా దుకాణం దగ్గరకు వాటిని తీసుకువెళ్లాడు. పాత పుస్తకాలను, పేపర్లను అమ్మివేశాడు.

సాయంత్రం ఐదు అవుతుంది. తాతగారు వస్తూనే తోటలో కొత్తగా తవ్విన కాలువలు చూసి ఆశ్చర్యపోయారు. అవి చాలా చక్కగా నీరు ఎక్కడా నిలువ ఉండకుండా బయటకు పారుతున్నాయి.

తాతగారు నాలుగురోజుల నుండి తన పొలంలో పనిచేసే నర్సింగ్‌ని తోటలో కాలువలు త్రవ్వమని చెబుతున్నారు. కాని వాడు రావడం లేదు. తాతగారు శ్రీనుని పొగడటం మొదలు పెట్టారు. 'నువ్వు కష్టపడటమే కాదు. పనిలో నీ బుర్రని కూడ ఉపయోగించావు,' అన్నారు.

తాతగారి పొగడ్తలకు శ్రీను మెలికలు తిరిగిపోయాడు. అమ్మమ్మ వచ్చి 'వీడు పాత పేపర్లు, పుస్తకాలను అమ్మి

ఎమ్. ఆనందరావు



ఎనభైరూపాయలు తెచ్చాడు,' అంటూ బాలు వైపు చూసింది.

'నా కొంప ముంచాడు. ఎంతో శ్రమ పడి సంపాదించుకున్న నా పాత పుస్తకాలన్నీ వీడు అమ్మేశాడు,' అంటూనే తాతగారు పున్నయ్య కొట్టు వైపు వెళ్లారు. 'పుస్తకాలతో వచ్చి నేను కొంత ఆలస్యం చేసి ఉంటే, నా పుస్తకాలను చించి పున్నయ్య చింతపండు పొట్లాలు కట్టేవాడు,' అన్నారు.

రాత్రి అయింది. ఊర్లోనే ఉంటున్న మామయ్య రావడంతో అందరం మామిడి చెట్టుకింద మంచాలు వేసుకుని కూర్చున్నారు. మావయ్య శ్రీనుని పాట పాడమని కోరాడు. శ్రీను సంగీతం నేర్చుకోవడం వల్ల చక్కగా పాట పాడి వినిపించాడు. మావయ్య బాలుని కూడ ఏదైనా పాట పాడమన్నాడు. 'వీడి నోటికి భయపడి అమ్మ వీడికి సంగీతం నేర్పించలేదు,' అంటూ శ్రీను తమ్ముడిని ఆటపట్టించాడు.

బాలు వెంటనే ఉదయం రేడియోలో విన్న పాటను అందుకున్నాడు. 'గౌరమ్మా.. నీ మొగుడెవరమ్మా?' అంటూ రాగం తీయసాగాడు. అమ్మమ్మ పేరు గౌరమ్మ అని తమ్ముడికి తెలియదు. వెంటనే శ్రీను తమ్ముడికి సైగ చేసినా వాడు రాగం ఆపలేదు. తాత గట్టిగా నవ్వడంతో, బాలు నెత్తిమీద అమ్మమ్మ ఒక్క మొట్టికాయ వేసింది. దానితో వాడు భోజనం కూడ ఏడుస్తూనే ముగించాడు.

రాత్రి ఎనిమిది గంటలు అయింది. ఇంట్లో తమ్ముడి జాడలేదు. తాతగారు, శ్రీను బయటకు వెళ్లి వెతికారు. శ్రీను ఇంటికి ఒంటరిగా రావడంతో అమ్మమ్మకి దుఃఖం పొంగుకొచ్చింది. శ్రీను నేలపై ఉన్న చాక్లెట్టు పై కాగితాన్ని గమనించాడు.

'అమ్మమ్మ! వాడు నేను బయటకు వెళ్లిన తరువాత, తమ్ముడు ఇంట్లోకి వచ్చాడు. ఇంతకు ముందు ఈ చాక్లెట్టు కాగితం లేదు,' అన్నాడు. తాతగారు అప్పుడే వచ్చారు. శ్రీను అటకపైకి వెళ్లడానికి ఉండే త్రాడుతో అల్లిన నిచ్చెన లేకపోవడం గమనించాడు. 'తాతగారూ వాడు ఖచ్చితంగా అటకమీద ఉన్నాడు,' అన్నాడు.

వాళ్లు గట్టిగా పిలిచినా బదులు రాలేదు. శ్రీను ఒక బల్లను అటక క్రిందికి

లాగి, దానిపై ఇంకో చిన్న బల్ల వేసుకుని పైకి ఎక్కాడు. కాని ఇంకా ఎత్తు సరిపో లేదు. శ్రీను నెమ్మదిగా కిందికి దిగి తాను తయారు చేసుకున్న పెరిస్కోప్‌తో చూశాడు. పేరిస్కోప్ అద్దంలో నిద్రపో తున్న బాలు కన్పించాడు. శ్రీను ఇంట్లో వాడే అద్దాన్ని రెండు చేతులతో పైకి ఎత్తి, అద్దాన్ని 45 డిగ్రీల కోణంతో ఉండేటట్టు చేసి, దానిలో నిద్రపోతున్న బాలుని అమ్మమ్మకి చూపించాడు. 'గ్రీకులు 45డిగ్రీల కోణంతో అమర్చిన అద్దం ద్వారా వీధిలో వెళ్లేవారిని గమ నించేవారు. నేను ఈ విషయాన్ని మా పాఠశాల గ్రంథాలయంలోని సైన్స్ పుస్త కంలో చదివాను,' అన్నాడు.

బాలుకి రాత్రి ఎనిమిదింటికే పడు కునే అలవాటు ఉండటంతో తాతగారు వాడ్ని లేపవద్దని అన్నారు.

అర్ధరాత్రి సమయంలో ఇంట్లోకి ఇద్దరు దొంగలు ప్రవేశించారు. అమ్మమ్మ అరుపులకి అటకమీద ఉన్న బాలు నిద్రలేచాడు. ఒక దొంగ అమ్మమ్మ బంగారపు గొలుసు లాక్కోసాగాడు. తాతను ఇంకో దొంగ కత్తితో బెదిరిస్తూ ఉన్నాడు. శ్రీను వాడి కాలుని గట్టిగా పట్టుకుని వెనక్కి లాగుతున్నాడు. బాలు వెంటనే విషయం గ్రహించాడు. వాడు అటకమీద ఉన్న ఒక పెద్ద ఆవకాయ జాడిని ఎంచుకుని దాన్ని సూటిగా అమ్మమ్మని బెదిరిస్తున్న దొంగ పైకి జార విడిచాడు. అది సూటిగా అమ్మమ్మని బెదిరిస్తున్న దొంగ పై ఠపీ మని పడింది.

ఆ దొంగకు బట్టతల ఉండటం చేత వాడు నిల్చున్న చోటే కూలబడ్డాడు. దీనిని అవకాశంగా తీసుకుని తాతగారు, శ్రీను రెండో దొంగని గట్టిగా పట్టుకు న్నారు. బాలు అటకమీద నుండి కిందికి దిగుతూనే రెండోదొంగ కాలిపిక్కను ముక్క ఊడివచ్చేటట్టు గట్టిగా కొరి కాడు. దానితో దొంగ విలవిలలాడుతూ చేసిన అర్తనాదానికి ఊరంతా మేల్కొంది. అందరూ వచ్చి దొంగలను తాళ్లతో బంధిం చారు. బాలుని అందరూ పొగడ్తలతో ముంచేశారు.





# కట్టుబాటు

త్రిధాముడనే ముని సౌశీల్యుడనే తన శిష్యునితో సహా దేశాటన చేస్తూ ఒక గ్రామం చేరుకున్నాడు. గురు శిష్యులిద్దరూ గ్రామం లోకి ప్రవేశించి ఎక్కడైనా బసచేయడానికి వసతి దొరుకుతుందా అని వెతుకుతుండగా ఒక వింతదృశ్యం వారి కంటబడింది.

ఆజానుబాహుడైన ఒకడు బక్క పలచగా వున్న ఒక వ్యక్తిని చెట్టుకు పెడరెక్కలు విరిచికట్టి కొరడాతో కొడుతున్నాడు. ఆ వ్యక్తి భార్య, ఆరేళ్ళ కొడుకు అతని కాళ్ళు పట్టుకొని కొట్టవద్దని వేడుకొంటున్నారు. చుట్టూ మూగిన జనం చోద్యం చూస్తున్నారు తప్ప ఒక్కరూ నోరు మెదపడం లేదు.

అక్కడున్న వాళ్ళు చెప్పిన దాన్ని బట్టి ఆ కొడుతున్నవాడి పేరు భుజంగం. ఆ చుట్టుపట్ల వున్న వంద గ్రామాలలోకెల్లా ధనవంతుడు. చెట్టుకు కట్టేసిన వ్యక్తి వీరయ్య. పుట్టి బుద్ధి తెలిసినప్పటి నుండి తన కుటుంబంతో సహా భుజంగం ఇంట వెట్టిచాకిరీ చేస్తున్నాడు. అందుక్కారణం వీరయ్యకు మూడు తరాల ముందు పెద్దలు భుజంగం మూడు తరాల ముందు పెద్దల వద్ద అవసరానికి అప్పు చేశారు. ఆ అప్పు ఇంతవరకు తీరలేదు. అప్పు తీరేవరకు వీరయ్య వంశీకులందరూ వంశ పారంపర్యంగా భుజంగం వంశీకుల వద్ద పనిచేస్తూ వస్తున్నారు. పిల్లాజెల్లా అందరూ పని చేయవలసిందే. భుజంగం వీరయ్య కుటుంబానికి అప్పుడప్పుడు తిండిగింజలు మాత్రం కొలుస్తుంటాడు. భుజంగం అప్పు తీరడం మాట అటుంచి యేయేటికా యేడు వడ్డీకూడా పూర్తిగా చెల్లు కావడం లేదు.

వీరయ్య పెద్దకొడుకు సూర్యం చాలా తెలివైనవాడు. భుజంగం పశువులు కాసుకొస్తూనే ఆసక్తికొద్దీ తీరిక దొరికినప్పుడల్లా నాలుగక్షరాలు చదువు నేర్చుకొన్నాడు. క్రమంగా లోకం తెలిసి వచ్చింది. ఒక

దాసరి వెంకట రమణ

రోజు భుజంగాన్ని నిలదీశాడు, మా తాతలు మీ తాతల వద్ద తీసుకొన్న అప్పెంత? మా తాతలు తమ హయాంలో ఎంత తీర్చారు. మా నాయన బాధ్యత వచ్చేసరికి ఎంత అప్పు వుంది? ఇంత మందిమి పని చేస్తుంటే మాకు కూలి ఏ లెక్కన కడుతున్నావు?

ఊహించని ఈ పరిణామానికి భుజంగం మెదడు మొద్దుబారింది. తేరుకున్నాక 'ఎంత ధైర్యంరా నీకు నన్నే లెక్క లడుగుతావా?' అంటూ సూర్యాన్ని బాగా కొట్టించాడు.

ఆ తర్వాత సూర్యం, భుజంగం పశువులు కాయకుండా? 'నగరానికి వెళ్ళి బాగా డబ్బు సంపాదించి వస్తాను' అని తండ్రితో చెప్పి ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. సూర్యం పశువులు కాయకుండా వెళ్ళిపోయాడని, ఎలాగైనా కొడుకును పిలిపించమని, భుజంగం వీరయ్యను హింసిస్తున్నాడు.

అదంతా వినగానే గురుశిష్యుల హృదయం ద్రవించింది. సౌశీల్యుడు పక్కనున్న వ్యక్తితో 'ఏమిటయ్యా ఈ అన్యాయం? మీ కెవరికి జాలి లేదా? ఇంత మందున్నారు. ఇది అన్యాయం అని అనలేరా?' అన్నాడు.

'నేనొక్కన్నీ ఏం చేయగలను చెప్పండి! భుజంగం బలవంతుడు, అతడు తలచుకుంటే ఏమైనా చేయగలడు,' అన్నాడతడు. సౌశీల్యుడు ఎవర్ని అడిగినా అదే సమాధానం.

సౌశీల్యుడు జనం మధ్యకు పోయి 'ఇది చాలా అన్యాయం! అసలు వీరయ్య



బాకీ ఎంతో తేల్చండి ముందు,' అన్నాడు పెద్ద గొంతుతో. అది వినగానే జనంలో తమలో తామే గొణుక్కొని తర్వాత పైకి 'ఇది అన్యాయం! వీరయ్య అప్పు ఎంతో చెప్పాల్సిందే,' అంటూ పెద్ద ఎత్తున అరిచారు.

త్రిధాముడు మధ్యలో కలుగజేసుకొని 'ఇప్పుడు చెప్పి తీరాల్సిందే!' అన్నాడు తన కంచుకంఠంతో. భుజంగం త్రిధాముడి వంక ఎగాదిగా చూసి 'ఏం తీరుస్తావా?' అని అడిగాడు ఎగతాళిగా.

'అది నీ కనవసరం! అప్పు లెక్కయినా చెప్పు లేదూ వీరయ్య కుటుంబాన్ని శాశ్వతంగా విడిచిపెట్టు,' అన్నాడు త్రిధాముడు. అతని కంఠంలోని ఒక విధమైన స్వాధికార గంభీర శబ్దానికి భుజంగం తటపటాయించి కాసేపు ఆలోచించి ఏదో నోటికొచ్చిన మొత్తం చెప్పాడు. త్రిధాముడు భుజంగం వంక సూటిగా చూస్తూ



'ఈ మొత్తానికి నీ వద్ద ఏదైనా అప్పు పత్రం వుందా?' అని అడిగాడు.

అప్పుపత్రం అడిగే సరికి భుజంగం కోపంతో 'అప్పు ఇప్పటిది కాదు. మా ముత్తాతల దగ్గర వీళ్ళ ముత్తాతలు చేశారు. అంతెందుకు నాకు అప్పు లేమని ఈ వీరయ్యను చెప్పమనండి చూద్దాం' అన్నాడు.

అందరూ వీరయ్య వంక చూశారు. వీరయ్య తలొంచుకొన్నాడు. సమాధానం చెప్పమని త్రిధాముడు రెట్టించి అడిగిన మీదట వీరయ్య కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ 'ఏం చెప్పేది? వీళ్ళకు మనం అప్పున్నాం. ఆ అప్పు తీరేవరకు మన కుటుంబం మొత్తం వాళ్ళింట్లో పని చేయాలని మా తాత మా నాయనకు చెప్పాడు, ఆయన నాకు చెప్పాడు. అంతే తప్ప, అప్పు ఎంత అని నే నేనాడూ అడగలేదు, ఆయన చెప్పలేదు,' అన్నాడు.

త్రిధాముడు భుజంగం వున్న అరుగు మీదనే కూర్చుని, తన కుడి కాలి కున్న కంకణం విడతీసి ఇస్తూ. 'దీనిని తీసు కొని వీరయ్య కుటుంబానికి విముక్తి కలి గించు,' అన్నాడు.

భుజంగం కంకణం తీసుకొని అటూ ఇటూ తిప్పి చూసి 'దీన్ని చెల్లు వేసు కున్నా అప్పు మొత్తం తీరదు ఇంకా వుంటుంది,' అన్నాడు బింకంగా.

త్రిధాముడు జనాన్ని ఉద్దేశించి 'పూర్వీ కులు చెప్పిన మాటను బట్టి కట్టుబా టుకు బందీయైన ఈ వీరయ్య కుటుంబం మానావమానాలను భరించి భుజంగా నికి వెట్టిచాకిరి చేస్తోంది. స్వేచ్ఛ లేనివారు మరణించిన వారితో సమానం. అందుకే ఈ రాజ్యాన్నేలే మహారాజుగారు స్వయంగా నాకాలికి తొడిగిన ఈ స్వర్ణ కంకణాన్ని ఈ భుజంగానికి ఇస్తున్నాను,' అంటూ భుజంగం వంక తిరిగి 'ఇది అమూల్య వజ్రాలు పొదిగిన స్వర్ణ కంకణం. దీని వెల ఇంత అని చెప్పలేను. కానీ దీన్ని అమ్మితే వచ్చే ధనంతో నీలాంటి వాళ్ళను వంద మందిని నిలబెట్టి కొనవచ్చని మాత్రం చెప్పగలను. నీ అప్పు తీరింది అని చెప్పే వరకు నేనూ నా శిష్యుడూ ఇక్కడే వుంటాం,' అన్నాడు స్థిరంగా.

త్రిధాముడు చెప్పింది వినగానే భుజం గానికి భయం పట్టుకుంది. మారు మాట్లాడకుండా 'నా అప్పు తీరింది. దీనిని మీరే వుంచుకోండి,' అంటూ కంకణాన్ని తిరిగి త్రిధాముడికి ఇచ్చి అక్కన్నుండి వెళ్ళిపోయాడు.

త్రిధాముడు వీరయ్య కుటుంబాన్ని దగ్గరికి పిలిచి 'నగరం చేరుకున్నాక రాజ

భటులతో వెతికించి మీ కుమారుడు సూర్యాన్ని తిరిగి పంపిస్తాను,' అంటూ వారికి ధైర్యం చెప్పి, సౌశీల్యుడితో కలసి అక్కడినుండి బయలు దేరాడు.

సౌశీల్యుడి మనసంతా ఆ సంఘటన నిండి పోయింది. తరాలు మారి ఒక లెక్కపత్రం లేని కాలదోషం పట్టిన అప్పు గురించి మూడు తరాలుగా తమను అమానుషంగా హింసిస్తున్నప్పటికి అది అన్యాయం అని ఎందుకు నోరు మెదపలేక పోతున్నారు? వాళ్ళను ఏ బలం కట్టి పడేసి, వాళ్ళతో వెట్టి చాకిరి చేయించింది? మరునాడు మధ్యాహ్నం ఒక సరోవరం ఒడ్డున దిరిసెన వనంలో విశ్రాంతి తీసుకుంటుండగా సౌశీల్యుడు గురువుకు తన సందేహాన్ని వెలిబుచ్చాడు. త్రిధాముడు నవ్వి, సౌశీల్యుడికి దిరిసెన వృక్షం నీడలో కట్టేసివున్న ఒక పెద్ద ఏనుగును చూపిస్తూ 'అక్కడ నీకు ఏం కనబడుతోంది?' అని అడిగాడు.

'ఏనుగు', అన్నాడు సౌశీల్యుడు.

'అది సరే! దానివంక తదేక దీక్షతో చూసి బాగా అబ్బురం కలిగించే అంశం ఒకటుంది. అదేమిటో చెప్పు,' అన్నాడు.

సౌశీల్యుడు అటు చూశాక కాసేపటికి త్రిధాముడు చెప్పింది అర్థం అయింది. అంత పెద్ద ఏనుగును చిన్న గొలుసుతో చెట్టుకు కట్టేశారు. నిజంగా ఏనుగు తలుచుకుంటే కాలు ఇలా విదిలిస్తేచాలు గొలుసు ఫట్ మని తెగిపోతుంది.

శిష్యుడి అంతరంగం చదివిన వాడిలా త్రిధాముడు 'ఏనుగు చిన్నగా వున్నప్పుడు ఆ గొలుసును తెంచుకోవాలని విశ్వప్రయత్నం చేస్తుంది. కానీ తెంచుకోలేదు. అది పెద్దది అయ్యే కొద్ది గొలుసు తెంచుకోవాలన్న ఆలోచన మానేసి, ఇక ప్రయత్నం చేయడం వృధా అని ఒక ధృఢ నిర్ణయానికి వచ్చేస్తుంది. ఈ కట్టుబాట్లు కూడా అంతే ఏనుగుబంధనం లాగే మనిషిని మానసికంగా బంధించి వుంచుతాయి. ఏనుగు జంతువు కాబట్టి ఆ కట్టుబాటులోంచి బయట పడలేక పోతోంది. కానీ, మనుషుల్లో సూర్యం లాంటి వాళ్ళ ద్వారా తప్పక కదలిక వచ్చి, వీరయ్య లాంటి వాళ్లకు భుజంగం లాంటి వాళ్ళ నుండి విముక్తి లభిస్తుంది,' అన్నాడు.





# పంచతంత్ర కథలు

'నీకూ, నాకూ పొత్తు కుదరదు,' అని హిరణ్యకం అనేసరికి లఘుపతనకం (కాకి) ఇలా అన్నది.

'మేము చిత్రగ్రీవాన్నీ, అతని అనుచరులనూ బంధవిముక్తులను చెయ్యటం చూసి నేను పరమానందం చెందాను. అందుకని నేను నీ స్నేహం కోరుతున్నాను.'

'నువ్వు తినేదానివి, నేను ఆహారాన్ని, లోకంలో మన ఇద్దరికీ సఖ్యం ఎలా సాధ్యం అవుతుంది? మైత్రికీ, వియ్యానికీ జన్మలూ సంపదలూ సమంగా ఉండాలి. అంతే గాని ఒకరు ధనికులూ, ఒకరు పేదవారూ, ఒకరు బలులూ, ఒకరు దుర్బలులూ అయితే అవి సాధ్యపడవు. అందుచేత నువ్వు తక్షణం వెళ్లిపో,' అన్నది హిరణ్యకం (ఎలుక) 'నువ్వు బయటకి రాకపోతే నేను నీ కలుగు ద్వారం దగ్గిరే ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడుస్తాను,' అన్నది లఘుపతనకం.

'నువ్వు ఎంత అసమంజసంగా మాట్లాడుతున్నావు! నా సహజ శత్రువుతో నేను ఎలా స్నేహం చెయ్యగలను? ఎలా కాళ్లా వేళ్లా పట్టినా, ఎంత సమభావాలు కలవారైనా శత్రువుతో చెలిమి చేయరాదని పెద్దలు చెప్పారు? సలసల కాగే నీటి సైతం నిప్పును ఆర్పుతుంది గదా!' అన్నది హిరణ్యకం!

'నువ్వు చెప్పేది మాత్రం ఎంత అసమంజసంగా ఉన్నది? నా మాట వినకుండానే నేను నీ సహజ శత్రువునని ఎలా అంటున్నావు?' అని లఘుపతనకం అడిగింది.

'శత్రువులు రెండు రకాలుగా ఉంటాయి. కొందరు జాతి శత్రువులు.

మరికొందరు ఏవో కారణాంతరాలవల్ల శత్రువలవుతారు. నువు నాకు జాతి శత్రువువు.

జీవిత వ్యాపకంలో ఏదో కారణం వల్ల ఏర్పడిన శత్రుత్వాన్ని తెలివిగా పరిష్కరించవచ్చు. జాతి వైషమ్యం మాత్రం ఎవరో ఒకరు చస్తే గాని అంతం కాదు,' అన్నది హిరణ్యకం.

'ఈ రెండు రకాల శత్రువుల మధ్యా తేడా తెలుసుకోవడం ఎలాగో దయ ఉంచి చెప్పు,' అని కాకి అడిగింది.

దానికి ఎలుక ఇలా చెప్పింది:

'సంపర్కం వల్ల ఏర్పడే శత్రుత్వానికి ఏదో ఒక ప్రత్యేకమైన కారణం ఉంటుంది. ఆ కారణాన్ని తొలగిస్తే ఆ శత్రుత్వం కూడా పోతుంది. ముంగిసా పామూ; శాకాహార మృగాలూ, మాంసాహార మృగాలూ; నీరూ, నిప్పూ; ధనికులూ, దరిద్రులూ; సింహమూ, ఏనుగూ; వేటగాడూ, లేడీ; వేదాలు తెలిసిన బ్రాహ్మడూ, నాస్తికుడూ; వివేకీ, మూఢుడూ; దేవతలూ, రాక్షసులూ-వీళ్ల మధ్య సహజ శత్రుత్వం ఉంటుంది. వీటిలో ఏ ఒక వర్గమూ ఇంకొక వర్గాన్ని పూర్తిగా నిర్మూలించలేదు. కాని వాళ్ల మధ్య సంఘర్షణ సాగుతూనే ఉన్నది; ఒకరిని తుడిచిపెట్టలేక పోయామే అన్న బాధ మరొకరికి ఉంటూనే ఉన్నది. ఇలాటి శత్రుత్వానికి విరుగుడు లేదు.'



'అలాటి శత్రుత్వం అనర్థమైనది. వివేకి అయినవాడు కొత్త మిత్రులను సంపాదించాలి గాని, పాత శత్రుత్వాలను పెంచుకోరాదు, కనుక నాతో స్నేహం చెయ్యి,' అన్నది కాకి.

దానికి ఎలుక ఇలా అన్నది;

'నువు మంచిదానివే కావచ్చు. నాకు అపకారం చేసే ఉద్దేశం నీకు లేక పోవచ్చు. అయినా మన స్నేహం వల్ల మేలు జరగదు. చివరకు ప్రకృతి స్వభావం జయిస్తుంది; నేను చాలా మంచిదాన్ని కాబట్టి, ఎవరి శత్రుత్వమూ నాకు కీడు కలిగించదనవచ్చు. కాని పాణిని అనే వ్యాకరణ వేత్తను ఒక సింహం చంపింది. జైమిని అనే తత్వవేత్తను ఒక ఏనుగు చంపింది. పింగళుడు అనే వేదపండితుణ్ణి ఒక మొసలి

చీల్చేసింది.'

కాకి ఇలా అన్నది;

'నువు చెప్పినది నిజమే. కాని నేను చెప్పేది కూడా విను. స్నేహభావమన్నది మనుషుల మధ్య పరస్పర సహకారం ద్వారా ఏర్పడుతుంది. మంచివాళ్లమధ్య ప్రధమ సందర్శనంలోనే కలుగుతుంది. నీకు ఎలాటి అపకారమూ చెయ్యనని ప్రమాణం చేస్తున్నాను.'

'నాకు నీ ప్రమాణాల పైన విశ్వాసం లేదు. శత్రువు చేసే ప్రమాణాలను విశ్వసించరాదు. తమను విశ్వసించని శత్రువును దేవతలు కూడా చంపలేరు. ఇంద్రుడు దితి గర్భాన్ని ఛిద్రం చేశాడు. ఎందుచేతనంటే దితి అతన్ని విశ్వసించింది.

అందుచేత శత్రువును నమ్మరాదు. ఎంతటి మహాబలులు కూడా విశ్వాసం ఉంచిన కారణంగా దుర్బలుల చేత నాశనం పొందుతారు,' అన్నది ఎలుక.

ఈ మాటలు విని కాకి కొంత సేపు ఏమీ అనలేకపోయింది. 'ఈ ఎలుకకు ఎంత నీతి తెలుసు! దీని స్నేహం చెయ్యాలనే కోరిక నాలో ఇంకా పెరుగుతున్నది గాని తరగటం లేదు,' అని అది అనుకున్నది.

చివరకు అది, 'ఓ హిరణ్యకా, ఏడడుగులు కలిసి నడిస్తేనే మిత్రులవుతారంటారు గదా. ఈ దీర్ఘ సంభాషణ వల్ల నువు అనుకోకుండానే, నాకు మిత్రుడవయావు. ఇలా మనం రోజూ మంచి చెడ్డలు మాట్లాడుకోవచ్చు గద!' అన్నది.

కాకి తెలివీ, దాని మాటల్లో నిజమూ ఎలుక గ్రహించి, 'అలాగే చెయ్యవచ్చు. కాని నువు నా కలుగులోకి ఎన్నడూ ప్రవేశించరాదు,' అన్నది. అందుకు కాకి ఒప్పుకున్నది.

(ఇంకా వుంది)





# వాసవుని వ్యాపారదక్షత

పురంధరుడు, పరమేశుడు మంచి స్నేహితులు. ఇద్దరూ వ్యాపారంలో మంచి దిట్టలు. ఒకరిది వస్త్ర వ్యాపారమైతే, మరొకరిది పచారీ దుకాణం. ఇద్దరూ కష్టపడి న్యాయంగా సంపాదించి ధనికులైనవారే. నెలకోసారి ఒక్కోరి ఇంట్లో కలిసి తమ వ్యాపార సాధక బాధకాలు చెప్పుకోడం వారికి అలవాటు.

ఆరోజున పరమేశుడు పురంధరుని ఇంటికి వచ్చాడు. వారిద్దరూ ఆరుబయట కూర్చుని తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటుండగా ఒక బిచ్చగాడు ఆ దారిన వచ్చి 'అయ్యా! ఉదయం నుండీ ఏమీ తినలేదు, కడుపు దహించుకుపోతోంది. ఏదైనా ఉంటేకాస్త ఇప్పిస్తారాబాబూ!' అని అడిగాడు.

పరమేశుడు కోపంగా 'ఏమోయ్! కాలు కన్ను బాగున్నాయ్! ఇలా బిచ్చమెత్తుకోకపోతే ఏదైనాపని చేసుకోవచ్చుగా?' అన్నాడు.

'బాబయ్యా! ఊహ తెల్సినప్పటి నుండీ అమ్మెవరో నాయనెవరో తెలీక ఇలా ఊళ్ళు పట్టుకు తిరుగుతున్నాను. ఇల్లావాకిలా? నన్ను నమ్మిపని ఇచ్చేదెవరు? అందుకే ఇలా పిడికెడు మెతుకులకోసం ఇల్లిల్లూ తిరిగి అందరిచేతా చివాట్లు తింటున్నాను. ఆ భగవంతునికీ నామీద జాలిలేదు,' అన్నాడు విచారంగా. వాడిని చూసిన పురంధరునికి జాలేసింది.

లోపలికి కేకేసి వాడికి కడుపునిండా అన్నం పెట్టించి 'చూడు బాబూ! నీపేరేంటన్నావ్,' అని అడిగాడు.

'వాసవుడంటారు బాబయ్యా!' వినయంగా చెప్పాడు అతడు.

'కండబలం ఉన్నవాడివి గుండెబలంతో పనిచేసుకోవాలి కానీ ఇలా బిచ్చమెత్తి ఎంతకాలం బతుకుతావు?

'వాసవా ! కనపడని దేవుడిని, దయ్యాన్నీ తిట్టుకునే బదులు, నీ మేధ ఉపయోగించి, స్వయం శక్తితో నీప్ర

ఆదూరి హైమవతి



యత్నం నీవు చేసి కష్టించి పని చేసుకో వచ్చుగా? అన్నాడు.

'బాబయ్యా! నన్ను నమ్మి మీరేమైనా పనిఇప్పిస్తే చేస్తాను,' అన్నాడు ఆకలి తీర్చినందుకు కృతజ్ఞతతో.

'సరే, నేను నీకొక బుట్టెడు చెట్టుకు పండిన మంచి మల్గోవా మామిడిపళ్ళు ఇప్పిస్తాను. నీవు వాటిని అమ్మి సొమ్ము జమచేయి. నిజాయితీ నిరూపించు కుంటే నీకు నేను సాయంచేస్తాను,' అని ఇంట్లోకి కేకేసి తనపాత బట్టలజత ఒకటి తెప్పించి, పనివారి చేత పండిన మామిడి పండ్లబుట్ట ఒకటి బయటికి తెప్పిం చాడు. 'చూడు వాసవా! నీవీచిరిగిన బట్టలతోవెళితే ఎవ్వరూ పండ్లు కొనక పోవచ్చు. ఈ బట్టలు వేసుకుని పండ్లు అమ్ముకురా!' అన్నాడు వాసవునితో పురం ధరుడు.

'అయ్యా! ఈ పండు ఒక్కోటీ ఎంత ధర పలుకుతుందో చెప్పండి' అని విన యంగా అడిగాడు వాసవుడు.

వాడికున్న వ్యాపార మెలకువకు పురంధరునికి సంతోషంకలిగింది. 'చూడూ వాసవా! ఇవి మంచి రుచికరమైన పండ్లు, ఒక్కోటీ సంతలో ఐతే ఇరవై రూపాయల ధర పలుకుతుంది, నీవు ఇల్లిల్లూ తిరిగి అమ్ముతావు గనుక ఎంత ధరకు ఇవ్వ వచ్చో నిర్ణయించుకో,' అని చెప్పిపం పాడు.

వాడటు వెళ్ళగానే 'నీ స్వభావం మార్చుకోనేలేదా పురంధరా! ఈ బిచ్చగా ళ్ళను నమ్మవచ్చా! వాడా పళ్ళ బుట్టతో ఉడాయించకపోతే చూడు. హాయిగా మూడునాళ్ళు నీడన కూర్చుని తింటాడు, ఆపైన వేరే ఊరెళ్ళి పోతాడు, బుట్టెడు పళ్ళు వృధాచేశావు,' అన్నాడు పరమే శుడు.

'పోనీలేపరమేశా! మనమూ మొదట్లో చిన్న వ్యాపారం చేసుకున్నవాళ్ళమేగా! మనకా రోజున ఆ రాఘవయ్య బాబు సాయం చేయ బట్టే మనం ఈరోజున ఇంతవారమయ్యాం, మనమూ మరొక రికి సాయంచేస్తే వాని బతుకూ బాగుపడ వచ్చు. లేదా వాడికి ఒక బుట్టెడు మామిడి పళ్ళు దానంచేసిన పుణ్యం నాకు దక్కక పోదు,' అన్నాడు నిశ్చింతగా.

'నిన్నుమార్చడం ఎవ్వరివల్లా కాని పని,' అన్నాడు స్నేహితుని ఏమీ అన లేక పరమేశుడు. అతడెవ్వరినీ సులు వుగా నమ్మడు.

'సరిపద, భోజనం చేసి కాస్త విశ్ర మిద్దాం. సాయంకాలం నేను కొత్తగా

వేయించిన కొబ్బరితోట చూపుతాను,' అంటూ లేచాడు పురంధరుడు.

సాయంకాలం వారిరువురూ కొబ్బరి తోటవైపు విహారంగా బయల్దేరారు.'నీ మామిడిపళ్ళ దాన ఫలం నీకు దక్కేట్లే ఉంది పురంధరా!' అని పరమేశం అంటుండగా, దూరం నుంచీ ఖాళీ బుట్టపట్టుకుని వాసవుడు రావటం ఇద్దరూ చూశారు.

వాసవుడు దగ్గరికివచ్చి 'అయ్యా! మీ చేతి చలవేమో ఇవ్వాళ పండ్లు అన్నీ సులువుగానే అమ్ముడయ్యాయి. ఇదు గోండి పైకం, మరికాస్త ఆలస్యమై ఉంటే మీరు దొరక్కపోదురేమో,' అంటూ సొమ్ము పురంధరుని చేతికి ఇచ్చాడు.

'ఒక్కోపండూ ఎంతకమ్మావేం?' ఆస క్తితో అడిగాడు పరమేశం.

'అయ్యా! ఐదుపళ్ళకు ఒకపండు ఉచితమని చెప్పి ఒక్కోటీ ముప్పయ్ రూపాయలకు అమ్మాను.. బుట్టలో నూట ఇరవై ఆరు పళ్ళున్నాయి బాబయ్యా! ఒక్కోటీ ఇరవైకి అమ్మితే రెండువేల ఐదు వందల ఇరవై రూపాయలు వచ్చేవి. నేను ఐదింటికి ఒకటి ఉచితంగా ఇచ్చినందున 21 పళ్ళు ఉచితంగా ఇచ్చినా ఒక్కోటీ ముప్పయ్‌కు అమ్మటం వలన ఆరువం దల ముప్పై రూపాయలు అదనంగా వచ్చాయి. తీసుకోండిబాబూ!' అంటూ సొమ్ము పురంధరునికి ఇచ్చాడు.

పురంధరుడు సంతోషంగా, 'చూశావా పరమేశా! చిన్న సహాయం అందితే ఎవ రైనా తమ తెలివి ప్రదర్శించే అవకాశం వస్తుందని ఈసోమయ్య నిరూపించాడు.

వాసవా!! నీ నిజాయితీకి వ్యాపార దక్షతకు చాలాసంతోషంగా ఉంది. ఇంత తెలివైనవాడివి చక్కగా వ్యాపారం చేసుకో! భిక్షమెత్తడం మానెయ్యి, ఆ ఆరువందల ముప్పై రూపాయలు నీవే, నీ తెలివికి, ఎండనపడి అమ్మినందుకూ భత్యం, రేపువచ్చి మరో రెండు బుట్టలు పట్టు కెళ్ళి అమ్ముకో, ఒకవారమయ్యాక పోగైన నీ డబ్బుతో స్వంతంగా ఏదైనా వ్యాపారం మొదలెట్టుకో. నీకు కావల్సిన సాయం నేను తప్పక చేస్తాను. కష్ట పడితే ఫలితం తప్పక ఉంటుంది, పోయిరా వాసవా!' అంటూ వాడి భుజంతట్టి పంపాడు.






# గాలివాన

రాత్రింబవళ్లూ వాన కురుస్తోంది. పక్షులు పెద్ద పెద్ద చెట్ల గూళ్లలో ఉండిపోయాయి. కొన్ని పక్షులు మాత్రమే వర్షపు చుక్కల నుండి తప్పించుకుని సురక్షితమైన గూళ్లలో తలదాచుకున్నాయి. చెట్లకాండంలో ఏర్పడిన తొర్రలలో నివసిస్తున్న పక్షులు మాత్రమే కాస్త సుఖంగా జీవిస్తూ వచ్చాయి. వీటిలో కొన్ని పక్షులు వానా కాలం కోసం తగినన్ని గింజలను, ఇతర ఆహార పదార్థాలను ముందుగానే దాచుకున్నాయి.

రాబిన్ అనే మగ చిలుక అలాంటి ఒక చెట్టు తొర్రలో నివసించేది. ఒక రోజు ఉదయం అది కడుపారా ఆరగించడంతో దానికి మత్తెక్కిపోయింది. వాన కురవటం నిలిచిపోగానే పొలాల్లోకి వెళ్లి తీపి బఠాణి గింజలను సేకరించాలని అది తలపోసింది.

తన తండ్రి చిన్నప్పుడు ఆకాశంలో ఎక్కువ ఎత్తులోకి ఎలా ఎగరాలి, వేగంగా చెట్టు కొమ్మపైకి ఎలా వాలి కూర్చోవాలో నేర్పిన జ్ఞాపకాలు రాబిన్‌కు గుర్తొచ్చాయి. అవి సాహసోపేతమైన, సంతోషకరమైన రోజులు. చెట్టు తొర్రలో ఉండిపోవడంతో రాబిన్ ఆలోచనలు ఎక్కువయ్యాయి.

'రాబిన్, ఓ రాబిన్', అంటూ ఎవరో రాబిన్ గూడుకు సమీపంలో నిల్చుని అరిచారు.

రాబిన్ గూడు బయటకి వచ్చింది. ఆశ్చర్యం.. తన చిన్న నాటి స్నేహితుడు చిట్టి కనిపించాడు.

'అద్భుతం మిత్రమా! ఇప్పుడే నీ గురించి తలపోస్తున్నాను. లోపలికి వచ్చి మన పడక మీద సేద దీర్చుకో. నీ ఈకలు బాగా తడిసిపోయాయి. పరామర్శించాడు రాబిన్. చిట్టి తన స్నేహితుడి వెచ్చటి గూటిలోకి అడుగుపెట్టాడు. 'మీ కుటుంబ సభ్యులు ఏరీ?' అనడిగాడు.

'నా భార్య దగ్గర్లోనే మరో తొర్రలో ఉంటోంది. గుడ్లు పెట్టినందువల్ల వాటిని

ఎం.కె. సోమనాథ పణిక్కర్

పొదగాలి మరి. త్వరలోనే పిల్లలు రాబో తాయి కూడా,' అన్నది రాబిన్.

'మంచి వార్త, అంటే నీ కుటుంబం పెద్దదవుతోందన్నమాట. అభినందనలు,' అన్నాడు చిట్టి.

రాబిన్, చిట్టి కాస్సేపు తమ బాల్య సాహసాల గురించి తల్చుకుని ఆనందించారు. మాటల మధ్యలో రాబిన్ చిట్టికి వెచ్చటి ఆహారం అందించింది. తొర్ర బయట అలికిడి వినిపించడంతో రాబిన్ లేచి చూసింది. పెద్ద కొండచిలువ కళ్లు మిటకరించి తొర్రలోకి చూస్తుండటం గమనించిన రాబిన్‌కు పై ప్రాణాలు పైనే పోయాయి.

'గత రెండు రోజులుగా నేనేమీ తినలేదు. నాకిప్పుడు చచ్చేంత ఆకలిగా ఉంది. మీలో ఒకరు మాత్రమే నాకు చాలు. రామచిలుక మాంసం మాంచి రుచిగా ఉంటుందని నాకు తెలుసు,' అంది కొండచిలువ బుసకొడుతూ.

'దేవుడా! ఈ క్రూర సర్పం మన పని పట్టడానికే వచ్చింది' అంటూ అరిచింది రాబిన్.

అలా ఆ పక్షులు రెండూ వణికిపోతుండగా కొండ చిలువ పక్షి గూడులోకి మెల్లగా ముందుకు కదిలింది. తొర్రలో తన పెద్ద తలను దూర్చగానే చెట్టుపై ఉన్నట్లుండి పెద్దగా కాంతి పడింది. పిడుగు పడినట్లుగా పెద్ద శబ్దం వినిపించింది. మాంసం కాలుతున్న వాసన చెట్టు తొర్ర నుంచి సోకింది.

'భగవాన్! కొండచిలువ పిడుగు బారిన పడినట్లుంది,' అనరిచింది రాబిన్. క్షణ కాలంలో ప్రాణం కోల్పోయిన కొండచిలువ చెట్టు మీదినుంచి దబ్బున కిందికి పడిపోయింది.

క్షణమాత్రంలో జరిగిన ఘటనను చూసి పక్షులు రెండూ నమ్మలేకపోయాయి. అద్భుతం జరిగి వాటి ప్రాణాలు నిలిచాయి.

'చూశావా! కష్టకాలాల్లో దేవుడు మనకు సహాయం చేసి కాపాడుతాడు,' చిట్టి వణుకుతూ అన్నాడు. కాస్సేపటి తర్వాత మళ్లీ హోరుగాలి శబ్దం వినిపించింది. క్రమంగా ఉరుములు, మెరుపులు పెరిగాయి. చూస్తుండగానే వర్షం మొదలైంది.





# అదృష్టదేవత

ఆఫ్రికాదేశంలో ఒక బెస్తవాడుండే వాడు. వాడు ఒక పెద్ద సరస్సులో చేపలు పట్టేవాడు. చేపలను పట్ట టానికిగాను వాడు పెద్ద పెద్ద పల్లికల లాటి ఊతలు ఉపయోగించేవాడు. వాడు తన తెప్పలో ఈ ఊతలను పట్టుకుపోయి, సరస్సు అట్టే లోతు లేని చోట వాటిని తాళ్లు కట్టి దించే వాడు. తాళ్ల చివర కర్ర ముక్కలు కట్టటం చేత అవి పైకి తేలి, ఊతలు ఎక్కడెక్కడ ఉన్నదీ వాడికి సులువుగా తెలిసేది. ఇంటికి వెళ్లేటప్పుడు ఈ ఊతలన్నీ పైకి లాగి, వాటిలో చిక్కిన చేపలతో పొట్ట పోసుకునేవాడు.

ఒకనాడు బెస్తవాడు తన ఊతలను ఒక్కొక్కటిగా పైకి లాగసాగాడు. రెండు ఊతల్లో ఒక్క చేప కూడా లేదు. మూడో దానిలో ఒక చిన్న ఎండ్రకాయ మాత్రం ఉన్నది. కాని నాలుగోది చాలా బరువుగా పైకి లేచింది. అమ్మయ్య, నా అదృష్టం పండింది! నా దరిద్రం తీరిపోయింది! అనుకుంటూ వాడు ఆ ఊతను తెప్పమీదికి లాక్కున్నాడు. అందులో, ఎండి వరడు గట్టిన ఒక ముసలిది మాత్రం ఉన్నది.

బెస్తవాడి ఆశ్చర్యం క్షణంలో అసహ్యంగా మారింది. వాడా ముసలి దాన్ని మళ్లీ సరస్సులోకి తొయ్యబో యాడు. కాని ఆమె వాడితో, 'మళ్లీ నన్ను నీటిలోకి తోసెయ్యకు, బాబూ, నీ వెంట నన్ను మీ ఇంటికి తీసుకుపో. నీకేమీ నష్టం ఉండదులే,' అన్నది.

'నిన్ను మా ఇంటికి తీసుకుపోనా? తాను దూర కంత లేదు, మెడకు డోలన్నట్లుగా, నేనే పొట్ట పోసుకోలేక

చస్తుంటే నిన్ను కూడా ఎక్కడ పోషిం చేది?' అన్నాడు బెస్తవాడు.

కాని ముసలిది కాళ్లా వేళ్లా పడి వాడిని వదిలిపెట్టక వాడి ఇంటికి వెళ్ళింది. వాడు అయిష్టంగా తన కూడులో నుంచే కొంత ముసలిదాని క్కూడా పెట్టాడు. ఇద్దరూ తిండి తిన్నాక వాడు, 'నాకేదో లాభం కలు గుతుందంటివే, ముసలి తొక్కా? ఆ లాభం ఏమిటో స్పష్టంగా చెప్పు. విని సంతోషిస్తాను,' అన్నాడు.

'రేపు సాయంకాలం లోపల నువ్వొక పశువుల మందకు యజమాని కాబో తున్నావు. అందుచేత విశాలమైన పశువుల దొడ్డి ఒకటి తయారు చేసుకో,' అన్నది ముసలిది.

బెస్తవాడు ఏవేవో ప్రశ్నలు వేశాడు. కాని ఆమె, 'నేను చెప్పినట్లు చెయ్యి,' అన్నది.

బెస్తవాడు తనలో తాను గొణుక్కు న్నాడు. అయినా వాడు మర్నాడల్లా శ్రమపడి చుట్టూ ముళ్లకొమ్మలతో బలమైన కంచె కట్టి పశువుల దొడ్డి తయారు చేశాడు. అది పూర్తయేసరికి సూర్యాస్తమయం కావచ్చింది.

ఈ పని పూర్తి అయిన మరుక్షణమే సరస్సు దిక్కు నుంచి పశువుల అరు పులు వినవచ్చాయి. త్వరలోనే ఒక ఎద్దు వెంబడి అనేక ఆవులూ, దూడలూ పెద్ద మందగా వచ్చి పశువుల దొడ్డిలో



ప్రవేశించి, రోజూ అలవాటైన వాటి లాగా తలా ఒక చోటా పడుకు న్నాయి.

ఇక నుంచి బెస్తవాడి జీవితం పూర్తిగా మారిపోయింది. వాడిప్పుడు పేదవాడు కాకపోగా మహాధనికుడు. ఆ చుట్టుపట్ల చాలా మైళ్లమేర వాడిని మించిన ధనికుడు లేడు. వాడు పొలాలు కొనుక్కున్నాడు. పెళ్లి చేసు కుని ఒక ఇంటివాడయ్యాడు. ఆ ప్రాంతాల ఉండే ఘరానా మనుషుల తోబాటు జమ అయాడు. ఎవరన్నా మనుషులతో బాటు జమ అయాడు. ఎవరన్నా సలహా అడగటానికి వస్తే గడ్డం నిమురుకుంటూ, 'నాకదే పని అనుకున్నావా? రేపు కనిపించు, చూస్తాం! వట్టి చేతులతో వచ్చేవు!' అని దర్పంగా మాట్లాడటం నేర్చాడు.

ఈ విధంగా ఆరు మాసాలు గడిచాయి. ఒక రోజు బెస్తవాడు పొరుగూళ్లో విందు జరిగితే అక్కడికి వెళ్లాడు. అక్కడ బాగా తిని, మితిమించి సారాయి తాగాడు. విందు ముగిసే సరికి పొద్దు పోయింది. బెస్తవాడు తూలుతూ అవకాశం దొరికితే ఎవరి మీద నైనా విరుచుకు పడటానికి సిద్ధంగా ఇంటికి వచ్చాడు. ఇంట్లో అందరూ తలుపులు వేసుకుని గాఢ నిద్రలో మునిగి ఉన్నారు.

'తలుపు! తలుపు! కామందు వచ్చాడు, తలుపు తెరవండి!' అని వాడు కేకలు పెట్టాడు. కాని ఎవరూ పలకలేదు. వాడికి ఆగ్రహం తన్నుకొచ్చింది. ''ఏమిటీ? నేనంటే అంత అలుసైపోయిందా? సరస్సులో నుంచి నేను పైకి తీసిన ఆ ముసలితొత్తు ఏం చేస్తున్నదీ? లేచి తలుపు తియ్యవే, ముసలిపీనుగా!' అని అరిచాడు. వాడి మాట నోట ఉండగానే తలుపు తెరిచి ముసలిది వాకిట నిలబడింది. ఆమె వాడికేసి చురచురా చూస్తూ, 'నువు నన్ను నిష్కారణంగా తిట్టావు. చేసిన మేలు మరిచే వాళ్ల దగ్గిరా, మసలుకోవడం తెలియని వాళ్ల దగ్గిరా నేనుండను. రేపే నాచోటికి నేను వెళ్లిపోతున్నాను,' అన్నది.

'ఓ యబ్బో! పోతే పో! పీడ విరగడ అవుతుంది,' అన్నాడు బెస్తవాడు.

మర్నాడు ఉదయం ముసలిది నిద్రలేచింది. పక్క బట్టలు చక్కగా మడిచి పెట్టింది. అంట్ల గిన్నెలు శుభ్రంగా తోమింది. ఇల్లు ఊడ్చింది. ఇంటి నుంచి ఒక పూచిక పుల్లకూడా తీసుకోకుండా వెళ్లి పశువుల దొడ్డి వాకిలి తెరిచింది.

తరవాత ఆమె సరస్సులో ప్రవేశించి కనిపించకుండా పోయింది. బెస్తవాడు మళ్లీ చేపలు పట్టి జీవించే స్థితికి వచ్చేశాడు. వాడి అదృష్ట దేవత వెళ్లిపోయింది.





# మాటల దుకాణం

పూర్వం ఒక గ్రామంలో ఒక వింత దుకాణం ఉండేది. అది మాటల దుకాణం. ధర్మపాలుడనే ఒకాయన ఆ దుకాణాన్ని నడిపేవాడు. ఆయన ఒక్కొక్క చీటీమీద ఒక్కొక్క సలహా రాసిపెట్టి, కావలసిన వారికి కావలసినన్ని సలహాలు అమ్మేవాడు. ఒక్కొక్క చీటీ ఖరీదు నూరు రూపాయలు. ఈ చీట్లు కొన్నవారు వాటిలోని సలహాలు పాటించి లాభం పొందుతుండేవారు.

ఒకనాడు ఆ దుకాణానికి ఒక శ్రేష్ఠి వచ్చాడు. ఆయన ధనికుడు. మాటల దుకాణంలో ఆయన మూడు వందలిచ్చి మూడు సలహాలు కొనుక్కున్నాడు. ఆ సలహా లేవంటే..

ప్రయాణమై వెళ్లేటప్పుడు భార్యకు వివరాలు చెప్పరాదు.

దారిలో భోజనం చేయవలసివస్తే దారికి సమీపంగా భోజనం చెయ్యరాదు. తొందరపడి ఎవరితోనూ దేన్ని గురించీ పందెం వెయ్యరాదు.

ఈ సలహాలను కొనుక్కుని శ్రేష్ఠి ఇంటికి వెళ్లాడు. వీటిలో యదార్థం ఎంతవరకు ఉన్నదీ తెలుసుకోవాలని ఆయనకు కుతూహలం కలిగింది.

భార్యతో చెప్పకుండా ఆయన తొమ్మిది సంచులలో తొమ్మిది వేల రూపాయలు తీసుకుని, బండి మాట్లాడుకుని, వ్యాపారం చెయ్యడానికి బస్తీకి బయలుదేరాడు.

శ్రేష్ఠి కొంతదూరం ప్రయాణించాక భోజనం వేళ అయింది. దారికి కొంత దూరంలో బావి కనిపించిన చోట బండీ ఆపి, బావి సమీపంలో భోజనం చేసి మళ్లీ ప్రయాణమ

యస్. రాజగోపాల రావు



య్యాడు. కొద్దిదూరం వెళ్లాకసంచులు లెక్క చూసుకుంటే, తొమ్మిది ఉండ వలసినవి ఎనిమిదే ఉన్నవి.

బావి వద్దకు వెళ్లి వెతికితే పోయిన సంచి దొరికింది. అది అక్కడే ఒక గడ్డి కుప్పకింద పడి ఉన్నది. తాను డబ్బిచ్చి కొనుక్కున్న సలహాలలో ఒకటి మేలు చేసింది. శ్రేష్ఠి సంతో షించాడు. తాను దారిలోనే భోజనం చేసినట్లయితే ఆ సంచిని దారే పొయ్యే వాళ్లు ఎవరో ఒకరు తీసుకుని ఉండే వారే.

ఆ సంచి తీసుకుని ఆయన బండి వద్దకు వస్తుండగా ఆయన కాలికి ఒక పిచ్చి పుచ్చకాయ తగిలింది. చిత్రమే మంటే, అది తగలగానే ఆయన కాలికి ఎంతో కాలంగా మానకుండా ఉన్న పుండు ఒకటి తుడిచి పెట్టినట్లు నయమయింది.

ఆ కాయలో ఏదో మహత్తు ఉండి ఉండాలనుకుని, దానిని తిరుగు ప్రయాణంలో తీసుకుపోయే ఉద్దే శంతో ఆయన బావి సమీపంలో గుర్తుగా ఒకచోట పాతిపెట్టి, బండి ఎక్కి ప్రయాణం సాగించాడు.

బస్తీలో వ్యాపారం బాగా కలిసివ చ్చింది. శ్రేష్ఠి పుష్కలంగా ధనం సంపాదించి దారిలో తాను దాచిపె ట్టిన పుచ్చకాయ మాట మరిచి, మరొక దారిన స్వగ్రామానికి తిరిగివ చ్చాడు.

ఆయన తిరిగి వచ్చేనాటికి ఆ గ్రామంలోని లక్షాధికారి రాచపుం డుతో భాధపడుతున్నాడు. ఆ రాచ పుండు నయం చేసిన వారికి పదివేల రూపాయలిస్తానని ఆయన చాటింపు వేయించాడు. ఏమంటే, ఎంతో మంది దానికి తగిన చికిత్స చెయ్యే లేక పోయారు.

ఈ సంగతి వినగానే శ్రేష్ఠికి తాను దాచిన పిచ్చి పుచ్చకాయ రాచపుండు నయమవుతుంది, తనకు పదివేలు లాభం వస్తుంది. ఈ సంతోషంలో ఆయన తాను కొనుక్కున్న సలహా లను మరిచిపోయి, తాను దాచిపెట్టిన పిచ్చి పుచ్చకాయ సంగతీ, తాను దాన్ని తీసుకొచ్చి చికిత్స చేసి పదివేలు

సంపాదించుకునేటందుకు అవకాశం ఉన్న సంగతీ భార్యకు చెప్పేసి, 'నేను ఇప్పుడే లక్షాధికారి వద్దకు వెళ్ళి ఆయన చేత ఒప్పందం రాయించుకుని వస్తాను. రేపు బయలుదేరి వెళ్ళి ఆ కాయ తెచ్చుకోవచ్చు,' అన్నాడు.

శ్రేష్ఠి గారి భార్య మరుక్షణమే ఈ విషయమంతా పూసగుచ్చినట్లు పొరిగింటి ఆవిడకు చెప్పింది. ఆవిడ తన భర్తకు చెప్పింది. శ్రేష్ఠి లక్షాధికారి ఇంటికి పోయేదారిలో పొరుగింటివాడు వచ్చి ఆయనను కలుసుకున్నాడు. మాటల సందర్భంలో ఇద్దరూ ఒకే పనిమీద వెళుతున్నట్లు స్పష్టమయింది.

'ఆ లక్షాధికారి రాచపుండు ఎలా నయమవుతుందో నాకు తప్ప ఇంకెవరికీ తెలియదు,' అన్నాడు శ్రేష్ఠి.

'ఆ రహస్యం నాకూ తెలుసును,' అన్నాడు పొరుగువాడు.

'లక్షాధికారి పుండు నయం చెయ్యటం నీ వల్ల కాదు,' అన్నాడు శ్రేష్ఠి.

'నయం చేస్తాను. చాతనైతే పందెం కాయి!' అన్నాడు పొరుగువాడు. శ్రేష్ఠి తాను కొనుక్కున్న సలహాలు మళ్ళీ మరిచిపోయి, తన పొరుగువాడు ఆ రాచపుండు నయం చేసే పక్షంలో ఆయన తన ఇంట దేన్ని తాకితే దాన్ని ఇచ్చేస్తానని పందెం కాశాడు.

పొరుగువాడు ఆ సాయంకాలమే బయలు దేరి నూతివద్దకు వెళ్ళి శ్రేష్ఠి దాచిపెట్టిన పిచ్చి పుచ్చకాయను తవ్వి తీసి లక్షాధికారి రాచపుండుకు దాన్ని తగిలించి నయం చేసేశాడు.

శ్రేష్ఠి ఇంకా బయలుదేరక ముందే



ఇంతా జరిగిపోయింది. అన్నప్రకారం తన పొరుగువాడు తన ఇంట్లోకి వచ్చి తన ఇనప పెట్టెతాకితే ఏం కాను? తన సంపదవేలకు వేలు అందులో ఉన్నది. తాను సలహాలను పాటించకపోవటం చేతనే ఈ ప్రమాదం వచ్చి పడింది. తాను పుచ్చకాయ కోసం పోబోతు న్నట్లు భార్యకు చెప్పాడు. అంతటితో పోనివ్వక తొందరపడి పొరుగువాడితో పందెం వేసుకున్నాడు.

శ్రేష్ఠి పరిగెత్తుకుంటూ మాటల దుకాణానికి వెళ్లి ధర్మపాలుడి కాళ్ల మీద పడి, జరిగినదంతా చెప్పి, తనకు నష్టం కలగకుండా ఉపాయం చెప్పమన్నాడు.

'జరిగిందేదో జరిగింది. నీ ఇనప పెట్టెను అటకమీద పెట్టించి, పొరు గువాడు వచ్చేసరికి అటకకు నిచ్చెన వేసి ఉంచు. నేను కూడా వస్తాను,' అన్నాడు ధర్మపాలుడు.

పొరుగువాడు శ్రేష్ఠి ఇంటికి వచ్చి తన పందెం వసూలు చేసుకుంటా డని తెలిసి నలుగురూ పోగయారు. ఆ సాయంకాలం పదిమంది ఎరి గినవాళ్లను వెంట బెట్టుకుని పొరు గువాడు శ్రేష్ఠి ఇంటిలోపలికి ప్రవే శించాడు.

అటూ, ఇటూ చూశాడు. ఇన ప్పెట్టే కనిపించలేదు. అటకా, నిచ్చెనా మట్టుకు కనిపించాయి. ఇనప్పెట్టె అటకమీద ఉన్నది. నిచ్చెన ఎక్కటానికి గాను పొరుగువాడు దాన్ని అనాలోచితంగా పట్టుకు న్నాడు.

'శ్రేష్ఠి, నిచ్చెన తాకావు. ఇక అది నీది కాదు. పందెంలో నీవు ఓడావు,' అన్నాడు ధర్మపాలుడు.

దీనికి పొరుగువాడు పదే పదే అభ్యంతరం చెప్పాడు. కాని అక్కడ చేరినవారంతా ధర్మపాలుడు చెప్పినది ధర్మమేనన్నారు. ఆయన ధర్మాన శ్రేష్ఠికి పెద్ద నష్టం తప్పింది.





# విధికి విరుగుడు లేదు

ఒక గ్రామంలో ఒక రైతు వద్ద నంజయ్య అనే గొడ్లకాపరి కుర్రవాడుండేవాడు. వాడు రోజూ ఉదయమే లేచి, తన యజమాని ఇంటి చాకిరీ చేసి, చద్ది తిని, బారెడు పొద్దెక్కేసరికల్లా గొడ్లను మేపటానికి తోలుకుపొయ్యేవాడు.

గ్రామం వెలుపల ఒక పాడుపడిన తోట ఉండేది. ఒకప్పుడు దానిలో మంచి మంచి ఫలవృక్షాలు ఉండేవి. కాని ఇప్పుడు దానికి ఆలనా పాలనా లేదు. తోటంతటా ఏవేవో పిచ్చి మొక్కలు మొలిచాయి. గడ్డి విపరీతంగా పెరిగింది. ఆ తోటలో పశువులకు కావలసినంత మేత. మేపుకుంటే అడిగే వాళ్లు లేరు. గొడ్లు కాసే కుర్రాళ్లు ఎక్కి ఆడుకోవడానికీ, కాయలు కోసుకు తినటానికీ చెట్లు కూడా ఉన్నాయి. అందుచేత నంజయ్య తోటివాళ్లు కూడా పశువులను తోలుకుని ఆ తోటకే వచ్చేవాళ్లు. పశువుల దారిన పశువులు మేత మేసేవి. కుర్రాళ్ల దారిన కుర్రాళ్లు సాయంకాలందాకా ఆడుకుని, పొద్దు వాలగానే మళ్లీ గ్రామానికి తిరిగి వచ్చేవాళ్లు. ఒకనాడు నంజయ్య పశువులను తోలుకుని మామూలు ప్రకారమే తోటకు వచ్చాడు. కాని ఆ రోజు పండగ కావటం చేత మిగిలిన కుర్రాళ్లెవరూ రాలేదు. పండగమాట నంజయ్యకు తెలీదు. బిక్కుబిక్కుమంటూ తోటలో ఒంటరిగా ఉండటం వాడికేమీ బాగాలేదు. కాలుగాలిన పిల్లిలాగా తోటంతా కలయదిరిగాడు. తన చిరాకు పశువుల మీద చూపి, వాటిని వాటి మానాన మేయ

త్రిపురారి సత్యనారాయణ

నివ్వక ఇటునుంచి అటూ, అటు నుంచి ఇటూ మళ్లించాడు.

అసలే చిరాకులో ఉన్న నంజయ్యా మీద ఒక కందిరీగ ఎటునుంచో వచ్చి వాలింది. అది తన మీదికి రావటం చూస్తూనే ఉండటం చేత వాడు దాన్ని ఒక్క చరుపు చరిచి చంపేశాడు. అప్పటికీ కసితీరక వాడు దాని కళే బరాన్ని రెండుగా విరిచి విసిరి ఎడంగా పారేశాడు. అది ఒక దుబ్బు మీద పడుతూనే ప్రాణం వచ్చి తుయిమని ఎగిరిపోయింది.

నంజయ్యా నిర్ఘాంతపోయి, కంది రీగ కళేబరం పడిన చోటికి వెళ్లి జాగ్ర త్తగా గమనించాడు. అది ఒక పొట్టి దుబ్బుమీద పడింది. ఆ దుబ్బు నిండా దట్టంగా ఆకులున్నాయి. ఆ ఆకులు మిగిలిన ఆకుల్లా కాకుండా ఎంతో నేవళంగా ఉన్నాయి. ఆ ఆకుల మహిమవల్లే చచ్చిన కందిరీగ బతికి ఉంటుందని వాడికి తోచింది. సంజీవి మొక్కలను గురించి వాడు విని ఉండటం చేత అది సంజీవి మొక్క అయి ఉండవచ్చుననుకుని వాడు దాన్ని జాగ్రత్తగా గుర్తుంచుకు న్నాడు.

నంజయ్యా కింకా ఈ సంజీవి మొక్క పైన పూర్తిగా నమ్మకం కుదర లేదు. ఆ దుబ్బుమీద నుంచి ఎగిరి పోయినది తాను విసిరివేసిన కందిరీగ కాదేమో! వాడు తోటంతా వెతికి ఒక చచ్చిపోయిన మిడత శరీరం సంపా దించి తెచ్చి, దాన్ని నింపాదిగా సంజీవి మొక్కపైన ఉంచాడు. క్షణంలో అది కదిలి, అటు ఇటూ తిరిగి, చివ్వున ఎటో ఎగిరిపోయింది.



అది తప్పక సంజీవి మొక్కేననీ, దాన్ని తాకిస్తే ఏ చచ్చిన ప్రాణి అయినా తిరిగి బతుకుతుందని నంజయ్య రూఢి చేసుకున్నాడు. ఇది తన తోటి కుర్రాళ్లకు ఎప్పుడు చెబుతానా అని వాడు తహతహలాడాడు.

కాని మర్నాడు కుర్రాళ్ళంతా పశువులను తోలుకుని తోటకు వచ్చే దారిలో వాడు మిగిలిన వాళ్లతో తాను సంజీవిమొక్కను కనిపెట్టానని, దానితో చచ్చిన కందిరీగనూ, మిడతనూ బతికించానని చెబితే, వాళ్లు ఆశ్చర్యపడడానికి బదులు వాణ్ణి గేలిచేసి ఏడిపించారు. నంజయ్యకు వాళ్లమీద కోపం వచ్చి తన రహస్యంగానే ఉంచేశాడు. కొద్ది రోజులు గడిచాయి. ఒకనాటి తెల్లవారుఝామున ఊరి కామందు చనిపోయాడు. ఆయనకు ఆ గ్రామంలో ఒక మిద్దె ఉన్నది. ఆ కామందు ధనికుడే కాక గొప్ప దాత కూడానూ. గుళ్లు కట్టించాడు. నూతులూ, చెరువులూ తవ్వించాడు. సత్రం కట్టించాడు. ఇళ్లు కట్టుకునే వాళ్లకూ, పెళ్లిళ్లు చేసుకునేవాళ్లకూ ఎన్నో దానాలు చేశాడు. అందుచేత గ్రామంలో వాళ్లు ఆయన్ని దేవుడల్లే చూసుకునేవారు.

ఆయన నెలరోజులు మంచాన తీసుకుని మరీ పోయాడు. ఈ నెల రోజులూ ఆయనకు ఎన్నో రకాల చికిత్సలూ చేశారు. ఎందరో వైద్యులు చూశారు. కాని ఒక్కరి ప్రయత్నమూ ఫలించలేదు. ఉదయం వేళ కామందు ఇంటిముందర జనం గుమికూడారు. కొందరు కామందును పొగుడు



తున్నారు. 'వైద్యులంటే మందులివ్వ గలరు గాని ప్రాణం పొయ్యగలరా?' అని శాస్త్రులుగారు అంటున్నారు.

ఈ మాట నంజయ్య చెవులబడింది. వాడు ఆ సమయానికి అటుగా పశువులను తోలుకుని తోటకు పోతున్నాడు. వాడు జరిగిన సంగతి తెలుసుకుని, 'కామందు గారిని బతికించే ఉపాయం నేను చెబుతాను. పాడుపడిన తోటలో సంజీవి మొక్క ఉన్నది,' అంటూ తన అనుభవం అక్కడి వారితో చెప్పాడు. చాలామంది వాడి మాటలు నమ్మలేదు. ఒకరిద్దరు, దింపుడు కళ్లాశగా, వాడివెంట తోటకు బయలుదేరారు.

నంజయ్య ముందూ, గ్రామస్తులూ వెనకా తోటలో ప్రవేశించారు. అంతకు ముందు తాను చూసిన దుబ్బు ఎక్కడుండేదీ వాడికి తెలుసు. దాదాపు రోజూ వాడు దాన్ని ఒకసారైనా కళ్లచూస్తూనే ఉన్నాడు.

అందుచేత వాడు సూటిగా అక్కడికే దారితీశాడు. కాని రోజూ కనిపించే ఆ నవనవలాడే ఆకులు వాడికి కనిపించలేదు.

'అది కాదు ఇదీ, ఇది కాదు అదీ' అనుకుంటూ వాడు ఆ తోటలోని ఒక దుబ్బు నుంచి ఇంకో దుబ్బుకు నడవసాగాడు.

గ్రామస్తులకు వాడిమీద కోపం వచ్చింది. వాళ్లచేత మాటలు పడటం ఒక వంకా, రోజూ కనిపించే దుబ్బు మాయం కావడం ఒకవంకా నంజయ్యను బాధించాయి. వాడు తోటంతా పదిహేనుసార్లు తిరిగినా ఆ దుబ్బు జాడ వాడికి తెలియనేలేదు.

ఇంతకూ అసలు విషయమేమిటంటే చనిపోయిన కామందుకు తిరిగి బతికే గీత లేదు మరి.

అందుకే ఎదురుగా ఉన్న సంజీవి కూడా నంజయ్యకు పాపం కనిపించకపోయింది.



# తాబేలు సందేశం

ఒక రోజు రంగడు వాళ్ళ మావయ్యతో సముద్రపు ఒడ్డుకు వెళ్ళాడు. మావయ్య ఎవరో తెలిసిన వ్యక్తి కనిపిస్తే అతనితో కబుర్లలో పడిపోయాడు.

ఎనిమిదేళ్ళ రంగడు సముద్రం దగ్గరికొచ్చి ఊరికే వుంటాడా... కాసేపు నీళ్ళల్లో తడిశాడు.

ఇంతలో ఒడ్డున ఓ తాబేలు కనిపించింది. దాంతో అక్కడేకూలబడి చూస్తూ మురిసి పోతున్నాడు. తాబేలు తల లోపలకు పెట్టేసుకుంది. పెంకులాంటి ఆ కవచం మాత్రమే బయటకు కనిపిస్తోంది. తల ఎంతకూ బయటకు పెట్టకపోవడంతో రంగడు నిరాశచెం దాడు. అక్కడ దొరికిన ఒక కర్రపుల్లతో దానిని పొడవడం మొదలు పెట్టాడు.. అయినా చలనం లేదు. కాస్త దూరం నుంచీ గమనించిన మావయ్య లేచి దగ్గరగా వచ్చాడు.

''చూడు మావయ్యా... ఇందాక ఎంచక్కా తల బయటకు పెట్టింది. కొద్దిగా నడిచింది కూడా.. నేను చూశాను.. ఇప్పుడు చూడు...''

చేతిలో కర్రపుల్లను లాక్కుని ''అది కాదు పద్ధతి... ఇలా చేస్తే అది చచ్చిపోతుంది''

''మరి''

మావయ్య దానిని ప్రేమగా తీసుకుని ఇంటికి తెచ్చాడు. వెనకాలే గెంతులేస్తూ రంగడు.

వంటపొయ్యి దగ్గరికి తీసుకొచ్చాడు. కాస్త ఇవతలగా వుంచాడు దానిని. కాసేప టికి, ఆ వెచ్చదనానికి తాబేలు తలబయటపెట్టింది. కాళ్ళను బయటకు తీసింది... నెమ్మదిగా ప్రాకడం మొదలుపెట్టింది. ''భలే... భలే'' ఆనందం కలిగింది రంగ డుకి.

''తాబేళ్ళు అంతే... మనుషుల్లాగే మొండి... బలవంత పెట్టకూడదు... నెమ్మ దిగా మచ్చిక చేసుకోవాలి... ప్రేమ చూపించాలి... అర్థమైందా...'' అన్నాడు మావయ్య.

– మంత్రవాది మహేశ్వర్





# సువర్ణహస్తం

పూర్వం దక్షిణ మధురలో ఒక పాండ్య రాజు రాజ్యం చేస్తూ ఉండే వాడు. ఆయన ప్రజలను బిడ్డల్లాగా చూసుకునేవాడు. ఎవరికీ ఎలాటి అన్యాయమూ జరగనిచ్చేవాడు కాడు. ఆయన రాజ్యం రామరాజ్యంలా ఉండేది. దేశంలో ఎవరికీ ఎలాటి కష్టం వచ్చినా ఆ సంగతి చారుల ద్వారా రాజుకు వెంటనే తెలుస్తూ ఉండేది. ఆయన సాధ్యమైనంత వరకు వారివారి కష్టాలను నివారణ చేస్తూ ఉండేవాడు. ఇదిగాక ఆయన తరచు మారువేషంలో తిరుగుతూ ప్రజల యోగక్షేమాలు స్వయంగా తెలుసుకుంటూ ఉండేవాడు. అందు చేత ఆయన రాజ్యంలో ప్రజలు చాలా సుఖపడేవారు.

ఒక రాత్రి రాజు మారువేషంలో నగరమంతా తిరుగుతూ పదిగంట లవేళ ఒక బ్రాహ్మణ వీధిలోకి వచ్చాడు. ఒక ఇంటి దగ్గరికి వచ్చేస రికి ఆయనకు లోపలినుంచి ఒక స్త్రీ దుఃఖిస్తూ ఉండటమూ, ఒక పురు షుడు ఆమెను సముదాయిస్తూ ఉండటమూ వినిపించింది. రాజు ఆ ఇంటి ముందు నిలబడి లోపల జరిగే సంభాషణ ఆలకించాడు.

సంగతేమంటే, ఆ ఇంట్లో ఒక బ్రాహ్మణ దంపతులు ఉంటున్నారు. వారికి పిల్లలు లేరు. మర్నాడే భర్త ఏదో పని మీద కాశీకి ప్రయాణమై వెళు తున్నాడు. ఆయన తిరిగి వచ్చేదాగా ఆ ఇంట్లో బిక్కుబిక్కుమంటూ ఒంటరిగా ఉండాలే అని భార్య చింతిస్తున్నది. 'ఆరు మాసాలు నిండి అమావాస్య రాగానే నేను తిరిగొస్తాను

వి.రమాదేవి

గద. ఈ ఆరు నెలలకీ సరిపోయే సంబారాలన్నీ ఇంట్లో చేర్చి ఉంచాను. అందుచేత నువు ఇంతగా విచారించ వలసిన పని ఏమీ లేదు.' అంటు న్నాడు భర్త.

'సంబారాలు తక్కువైపోతాయని నేనేమీ బెంగపడటం లేదు. ఆడ దాన్ని, అందులోనూ ఒంటరిదాన్ని, ఆరుమాసాల పాటు కొంపలో తోడు లేకుండా ఉండాలంటే ఎంత కష్టం చెప్పండి? ఏ రాత్రి ఏ దొంగాడు లోపల జొరబడతాడో అని ప్రాణాలు పిచపిచలాడతాయి గద?' అంటు న్నది భార్య.

'ఓసి పిచ్చిదానా, పెట్టని కోట లాగా మన రాజుగారుండి ప్రజలను కంటికి రెప్పలాగా కాపాడుతుంటే దొంగల భయమా? ఇంకా నయం! మన దేశంలో ఎక్కడన్నా దొంగలు పడ్డట్టు ఎప్పుడైనా విన్నావా? ఇంత రాజ్యాన్ని కాపాడే మహారాజు నిన్ను దొంగల భయం నుంచి కాపాడలేక పోతాడనా నీ భయం? అటువంటి పిచ్చి భయాలు మాను,' అన్నాడు భర్త.

ఈ సంభాషణ విని రాజు ముందుకు సాగిపోయాడు. మర్నాడు ఆ ఇంటి యజమాని కాశీకి బయలు దేరి వెళ్లిపోయాడు. ఆ రాత్రి రాజు మారువేషంలో ఆ వీధికి వచ్చి ఆ ఇంటి ముందు తెల్లవార్లూ కాపలా కాశాడు. అది మొదలు ఆయన రోజూ రాత్రి వేళ ఆ ఇంటికి కాపలా ఉంటూ వచ్చాడు.



రోజులూ, వారాలూ, నెలలూ గడిచిపోయాయి. ఆరు నెలలూ నిండి అమావాస్య వచ్చింది. రాజు తన అలవాటు ప్రకారం ఆ ఇంటి ముందు కాపలా కాయడానికి మారు వేషంలో వచ్చాడు. ఆయన వాకిలి సమీపించేసరికల్లా లోపలి నుంచి ఎవరిదో మగవాడి గొంతు వినిపించింది. ఇంటి యజమాని లేని సమయంలో పరపురుషుడెవరో లోపల ప్రవేశించి ఉంటాడని అనుమానించి రాజు తలుపు తట్టాడు. కాని ఆయన మరుక్షణమే తలుపు సందులో నుంచి చూసేసరికి ఇంటి యజమాని కాశీ నుంచి తిరిగి వచ్చి తన భార్యతో మాట్లాడుతూ ఉండటం రాజు కంట పడింది. ఆయన కంగారు పడిపోయాడు. తొందరపడి తలుపు తట్టడం చాలా పొరపాటయింది. తాను కాశీకి వెళ్లిన కాలంలో ఎవరో వచ్చి తన వాకిలి తలుపు తట్టుతూ ఉండి ఉంటారని ఆ బ్రాహ్మణుడు అనుమానపడగలడు. తాను చేసిన ఈ పొరపాటు సరిదిద్దుకునే ఉద్దేశంతో రాజు గబగబా ఆ వీధిలోని మరికొన్ని వాకిళ్ల తలుపులు కూడా తట్టి చీకట్లో పడి వెళ్లిపోయాడు.

తలుపు తట్టినది ఎవరా అని తెలుసుకోవటానికి ఇళ్లలో వారంతా బయటికి వచ్చారు. అందరూ కూడ బలుక్కుని, ఇది ఎవరో దొంగ చేసిన పని అయి ఉంటుందనుకున్నారు. ఆ నగరంలో అటువంటి సంఘటన ఎన్నడూ జరిగి ఉండలేదు. అందు



చేత వారు రాజుగారికి ఈ విషయమై ఫిర్యాదు చేయాలని నిశ్చయించుకు న్నారు.

మర్నాడు వారందరూ రాజ సభకు హాజరయి, 'మహారాజా, ఇంతకాలంగా తమ అండన ఎలాటి చోర భయం లేకుండా సుఖంగా జీవనం చేస్తూ ఉన్నాం. అయితే నిన్న రాత్రి మా వీధిలో ఒకసంఘటన జరిగింది. అది మాకు ఆందోళన కలిగించేదీ, మీకు అపకీర్తి కరమైనదీనూ. ఎవరో దొంగ కిందటి రాత్రి మా వీధికి వచ్చి మా ఇళ్ల తలుపులు తట్టి పారిపోయాడు. వాడిని పట్టుకుని శిక్షించాలని మా ప్రార్థన,' అని విన్నవించుకున్నారు.

వెంటనే రాజు తన ప్రధానమంత్రి కేసి తిరిగి, 'వీళ్లు చెప్పే నేరం చేసిన వాడికి మనం విధించే దండన ఏమిటి?' అని అడిగాడు.

'పౌరులను భయపెట్టిన ఆ దుర్మార్గుడి కుడిచెయ్యి నరకడమే ఈ నేరానికి తగిన శిక్ష మహారాజా!' అని మంత్రి సమాధానం చెప్పాడు.

వెంటనే రాజు తన కత్తి దూసి తన ఎడమచేత్తో కుడిచేతిని నరుక్కున్నాడు. తరవాత జరిగిన సంగతి యావత్తూ చెప్పేశాడు. అందరూ దుఃఖితులై, రాజుగారి ధర్మబుద్ధిని కొనియాడారు. తరవాత ఒక బంగారు చెయ్యి చేయించి రాజుగారి మోచేతికి అమర్చారు. అందరూ కలిసి సుందరేశ్వర స్వామి ఆలయానికి వెళ్లి ప్రార్థించగా స్వామివారు అనుగ్రహించి రాజుగారి కుడిచెయ్యి మామూలు చెయ్యిలాగే ఉండేటట్టు కటాక్షించారు.

తళతళా మెరిసే ఆ బంగారు చెయ్యి కారణంగా ఆ రాజుకు సువర్ణ హస్త పాండ్యుడు అనే పేరు వచ్చింది.





# అబద్ధాలకోరు

కమలాపురానికి చెందిన వీరభద్రుడి చిన్నప్పుడే తండ్రి పోవడంతో, తల్లే అతన్ని పెంచి పెద్ద చేసింది. భర్త మిగిల్చిన మూడెకరాల పొలం స్వయంగా సాగుచేసుకుంటూ కొడుకును ఒంటిరెక్క మీద సాకింది. తండ్రిలేని పిల్లవాడని అతి గారాబం చేయడంతో వీరభద్రుడికి చదువు అబ్బలేదు. బాల్యమంతా స్నేహితులతో విచ్చలవిడిగా గడిపేసాడు. పెద్దయ్యాక కూడా వ్యవసాయంలో తల్లికి సాయపడకుండా షోకిల్లాలా తిరిగేవాడు.

ఓసారి తల్లి వీరభద్రుడితో, 'నాయనా! మునుపటిలా వ్యవసాయపు పనులు చూసుకోవడం నాకు కష్టంగా ఉంటోందిరా. పోనీ, కూలీలను పెట్టుకుందామా అంటే, మనుషులు దొరకడం కూడా కష్టమవుతోంది. ఇకనైనా నువ్వు ఈ వ్యవహారాలను స్వయంగా చూసుకోవడం మంచిది,' అంటూ బోధించింది.

అందుకు అతను, 'ఈ దుక్కి దున్నడాలు, మట్టి పిసకడాలు నావల్ల కాదు,' అన్నాడు చిరాకుగా.

తల్లి పోరు పడలేక ఏదో మారు బేరాలు చేసే వ్యాపారం ఆరంభించాడు కాని, అది అంతంత మాత్రంగానే ఉండేది.

వీరభద్రుడికి చిన్నప్పటినుంచీ అబద్ధాలు చెప్పే అలవాటు ఉంది. అది అతనితో పాటు పెరిగి పెద్దదయింది. వ్యాపారరీత్యా ఇతర ఊళ్ళకు వెళ్ళే వీరభద్రుడు ఒకచోట తాను వైద్యుడనని చెప్పుకుంటే, ఇంకోచోట వకీలునని చెప్పుకునేవాడు. మరో ఊళ్ళో తానొక పెద్ద వ్యాపారవేత్తగా చాటుకునేవాడు. అతని వేషభాషలు చూసి నిజమేనని నమ్మేవారంతా.

ఓసారి ఏదో ఊరి నుండి వైద్యుడు వీరభద్రుడిని వెదుక్కుంటూ ఓ రోగి కమలాపురానికి వచ్చాడు. ఇంకోసారి వకీలు వీరభద్రుడి కోసం ఎక్కణ్ణుంచో వ్యాజ్యకారులు వచ్చారు. అతని వ్యాపారంలో భాగస్వామ్యం కోరుతూ మరోసారి ఇంకేదో ఊరి నుండి కొందరు వ్యక్తులు అతని ఇంటికి వచ్చారు. వీరభద్రుడు సమయోచితంగా వారందరికీ ఏదో చెప్పి పంపేసాడు. ఐతే ఆ సంఘటనలతో కమలాపురం గ్రామస్థులకు వీరభద్రుడి అబద్ధాల చిట్టా అవగతమయిపోయింది. అతనికి అబద్ధాలకోరు అని ముద్దు పేరు పెట్టుకున్నారు.

తిరుమలశ్రీ

ఓసారి ఆ ఊరి పెద్దకాపు వీరభద్రుణ్ణి పిలిపించి, 'నీకు అబద్ధాలు ఆడడం తప్పే ఇంకేమీ చేతకానట్టుంది. అతికినట్టుగా అబద్ధాలు ఆడడం కూడా ఓ కళే! నువ్వు దాన్నే వృత్తిగా చేపడితే బాగుపడతావనిపిస్తోంది,' అన్నాడు.

వీరభద్రుడు అయోమయంగా చూస్తే, తన మనసులోని మాటను వివరించాడు అతను... పెద్దకాపు అల్లుడు పట్టణంలో పేరు పొందిన వకీలు. అతని వద్దకు వెళ్తే వీరభద్రుడికి ఓ దారి చూపుతాడు... వీరభద్రుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

పెద్దకాపు అల్లుడు గోపాలం, మామగారి సిఫారసు కావడంతో వీరభద్రుణ్ణి సాదరంగా అహ్వానించాడు. 'నా వృత్తిలో నీలాంటివాడి అవసరం ఎంతైనా ఉంది. నేను చెప్పినట్టు చేసావంటే నీకు చేతినిండా డబ్బే!' అంటూ, ఏం చేయాలో వివరించాడు. వీరభద్రుడు ఆనందంగా తన సమ్మతి తెలియజేసాడు.

గోపాలం తన వద్దకు వచ్చే వ్యాజ్యాలలో అవసరాన్నిబట్టి అబద్ధపు సాక్షులను ప్రవేశపెడుతూంటాడు. వీరభద్రుడు వచ్చినప్పట్నుంచీ వివిధ వ్యాజ్యాలలో అతని చేత వివిధ రూపాలలో, పేర్లతో న్యాయస్థానాలలో అబద్ధపు సాక్ష్యాలను చెప్పించసాగాడు. అందుకు తగిన ప్రతిఫలం ముట్టజెప్పేవాడు. వీరభద్రుడికి ఇది నికార్సయిన వృత్తిగా కూడా పరిణమించింది. ఏడాది తిరక్కుండానే అతని ఆర్థిక పరిస్థితి బాగా మెరుగయింది.

ఇలా ఉండగా ఓసారి తల్లిని చూసి వచ్చేందుకని కమలాపురానికి వెళ్ళాడు వీరభద్రుడు. అక్కడ నాలుగు రోజులు గడిపి పట్టణానికి తిరుగు ప్రయాణమయ్యాడు. గాలి వాన రావడంతో వీరభద్రుడు సమీపంలో ఉన్న ఓ పాడుబడ్డ



సత్రం దగ్గర ఆగవలసి వచ్చింది.

ఆ సత్రం లోపల అప్పటికే ఓ వృద్ధ దంపతులు తలదాచుకున్నారు. పేదరికానికి చిహ్నంగా ఉన్న ఆ జంటకు ఎడంగా నిల్చున్నాడు వీరభద్రుడు. వారి కొడుకు మీద దొంగతనం చేసాడంటూ అబద్ధపు నేరారోపణ చేయబడింది. ప్రస్తుతం అతను ఖైదులో ఉన్నాడు. మర్నాడు ఆ వ్యవహారం న్యాయస్థానంలో విచారణకు రానుంది. ఆరోపణలు చేసినవారు ధనము, పలుకుబడీ కలవారు కనుక అతనికి శిక్ష పడడం ఖాయం అంటున్నారంతా. ఒక్కగానొక్క కొడుక్కి శిక్ష పడితే ఆ వృద్ధులు అనాథలవుతారు. ఆ పరిస్థితికి తట్టుకోలేక వారు ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నారు. చివరిసారిగా కొడుకును కళ్ళారా చూసుకోవాలన్న కోర్కెతో కాలి నడకను పట్టణం బైలుదేరారు.

వారి దైన్యస్థితి వీరభద్రుణ్ణి కదలించివేసింది. అమాయకుల్ని ఆదుకునేందుకు దేవుడున్నాడనీ, తొందరపడి జీవితాలు



చాలించుకోవద్దనీ వారిని ఓదార్చాడు. గాలి దుమ్ము తగ్గాక వాళ్ళను తనతో బండి మీద తీసుకువెళ్ళి పట్టణంలో దింపాడు...

ఆ రోజు వీరభద్రుడు ఓ వ్యాజ్యంలో సాక్ష్యం చెప్పవలసివుంది. న్యాయస్థానానికి వెళ్ళిన అతనికి, అక్కడ గత దినం తనతో వచ్చిన వృద్ధులు కనిపించారు. తమ కొడుకు విచారణ జరుగబోతూన్నదంటూ, బోనులో నిల్చున్న ముద్దాయిని చూపించారు. ఇర వయ్యేళ్ళకు మించని ఆ కుర్రాణ్ణి చూసిన వీరభద్రుడు ఖంగుతిన్నాడు. నెల క్రితం జరిగిన సంఘటన ఒకటి హఠాత్తుగా మదిలో మెదిలింది...

ఏదో వ్యవహారం పైన జంగంపల్లికి వెళ్ళాడు వీరభద్రుడు. రాత్రి ఐపోయింది. ఊరి పొలిమేరలను చేరుకునేసరికి పెద్ద వర్షం రావడంతో దాపులో గుడి కనిపిస్తే అందులో దూరాడు.

అదే సమయంలో ఆ గ్రామ మునసబు, గుడి పూజారీ కలసి ఆ గుళ్ళోంచి దేవుడి నగలు దొంగిలించారు. ఆ గ్రామానికి కాప లాదారుగా పనిచేస్తూన్న ఓ యువకుడు వారిని చూసి ఆపాడు. అనుమానంతో వారి వద్దనున్న మూట తెరిస్తే దేవుడి నగలు బైటపడ్డాయి. అతను తేరుకునే లోపే.. మునసబు, పూజారీ ఎదురుతిరిగి, ఆ దొంగతనం అతనే చేసాడంటూ పట్టుకుని ఆ యువకుణ్ణి ధ్వజస్థంభానికి కట్టేసారు. ఓ నగ అతని జేబులో పడేసి, మిగతా వాటిని రహస్యంగా గుళ్ళోని విగ్రహం క్రింద ఉన్న కంతలో దాచారు...

అదంతా తిలకించిన వీరభద్రుడు అవాక్కయ్యాడు. దొంగతనం తనకూ అంటగడతారన్న భయంతో బైటపడకుండా.

ఇప్పుడు అదే నేరానికి సంబంధించి తాను ముద్దాయికి వ్యతిరేకంగా అబద్ధపు సాక్ష్యం ఇవ్వవలసియున్నట్టు విని వీరభద్రుడు తెల్లబోయాడు. గ్రామ మునసబు, పూజార్ల సాక్ష్యం ఉండగా మరో సాక్ష్యం ఎందుకని అడిగాడు.

అందుకు గోపాలం చెప్పినసంగతులివి- ముద్దాయి తాను నిర్దోషిననీ, అసలు దొంగలు ఆ గ్రామ పెద్దలేననీ వాంఙ్మూలం ఇచ్చాడు. దానికి తోడు ఒక్క నగ తప్ప మిగతావి అతని వద్ద దొరకలేదు. అందువల్ల ఎందుకైనా మంచిదని వారిద్దరూ కలసి తమ తరపున వకీలును నియమించుకున్నారు. అది గోపాలం కావడం విశేషం. దొంగతనం జరిగిన రోజున వీరభద్రుడు జంగంపల్లికి వెళ్ళినట్టు తెలిసింది. ఆ గ్రామానికి సంబంధంలేని మూడో వ్యక్తి సాక్ష్యమిస్తే తిరుగుండదు.

ఆ రాత్రి వర్షానికి నువ్వు ఆ గుళ్ళో తల దాచుకున్నావనీ, ఆ సమయంలో ముద్దాయి దేవుడి నగలు దొంగిలించి పారిపోతూంటే మునసబు, పూజారీ పట్టుకున్నారనీ సాక్ష్యం చెప్పాలి నువ్వు, అన్నాడు గోపాలం. అందుకు మునసబు అతనికి పెద్ద మొత్తమే ముట్ట

జెప్పబోతున్నట్టు కూడా చెప్పాడు.

న్యాయమూర్తి విచారణ ప్రారంభించాడు. ముద్దాయి తాను నిర్దోషినని చెప్పాడు. మునసబు, పూజార్లు విచారింపబడ్డారు. ముద్దాయే నేరం చేసి పారిపోతూంటే తాము పట్టుకున్నట్టు చెప్పారు వాళ్ళు. అనంతరం వీరభద్రుడు ప్రవేశపెట్టబడ్డాడు.

ఓ క్షణం ముద్దాయి వంక, అతని తల్లి దండ్రుల వంక, మునసబు-పూజార్ల వంక, గోపాలం వంక చూసాడు వీరభద్రుడు. తరువాత భగవద్గీతపైన ప్రమాణం చేసి నోరు విప్పాడు...

ఆ రోజు తాను కళ్ళారా చూసిన నిజాన్ని అతను ఉన్నదున్నట్టుగా చెబుతూంటే ఖంగుతిన్నారంతా. మునసబు, పూజారి, గోపాలంవాళ్ళ ముఖాలు నల్లగా మాడిపోయాయి.

వీరభద్రుడి వాంఙ్మూలాన్ని నమోదు చేసిన న్యాయమూర్తి, అప్పటికప్పుడే రక్షకభటులను తోడిచ్చి అధికారులను జంగం పల్లికి పంపించాడు. కొంతసేపటి తరువాత, గుళ్ళో విగ్రహం క్రింద దొరికిన దేవుడి నగల మూటతో తిరిగి వచ్చారు వాళ్ళు.

నిజం బైటపడడంతో న్యాయస్థానం ఆ యువకుణ్ణి నిర్దోషిగా విడుదల చేసి, మునసబు, పూజార్లను ఖైదు చేయించింది.

గోపాలం కోపాన్ని వీరభద్రుడు లెక్క చేయ లేదు. ఆ యువకుడి తల్లిదండ్రులు కృతజ్ఞతతో చేతులు జోడించి కాళ్ళమీద పడబోతే వారించాడు.

ఇప్పుడు వీరభద్రుడి మనసంతా తృప్తితో, సంతోషంతో నిండిపోయింది. వంద అబద్ధాలు ఆడినప్పుడు కూడా కలుగని ఆనందం, తృప్తీ ... ఒక్క నిజం చెప్పినప్పుడు కలగడం అతనికి చిత్రంగా తోచింది. నిజం చెప్పడంవల్ల కలిగే దివ్యానుభూతి అనుభవానికి రావడంతో, అంత వరకు తన అబద్ధాలకు ఎందరు అమాయకులు బలయ్యారోనన్న తలంపు అతని గుండెల్ని మెలిపెట్టింది. ఇకమీదట ఎట్టి పరిస్థితులలోనూ అబద్ధం ఆడరాదని దృఢంగా నిశ్చయించుకున్నాడు.

ఆ సంఘటనతో గోపాలం తనను దగ్గరకు రానివ్వడనీ, అందువల్ల తన రాబడి నిలచిపోతుందనీ అతడెరుగును. బ్రతుకుతెరువు కోసం అబద్ధాలే ఆడనవసరంలేదనీ, నీతిగా నిజాయితీగా ఏ పని చేసుకున్నా బ్రతికేయవచ్చుననీ అనుకున్నాడు. గ్రామానికి వెళ్ళిపోయి వయసైపోయిన తల్లికి పొలం పనులలో అండగా ఉండాలని నిర్ణయించుకోవడంతో అతని మనసు తేలికపడింది.





# అమృతం

సిద్ధంపల్లె జమీందారుగారికి, అదే ఊళ్లో తమ పొలానికి దగ్గరగా పాకలో నివసించే రైతుకు ఒక్కసారే పుత్రసంతానం కలిగింది. ఐదేళ్లు గడిచాయి.

జమీందారు కొడుకు ఎంత ఖరీదయిన ఆహారం తింటున్నా ఎందుకో చాలా బలహీనంగా ఉండేవాడు. ఎప్పుడూ చిరాకుగా ఉండేవాడు.

ఆటపాటల పట్ల అతడికి ఏ మాత్రం ఆసక్తి ఉండేది కాదు. ఏదయినా వ్యాధి ఉందేమోనని వైద్యుని చేత పరీక్షలు చేయించి రక్తహీనత తప్ప ఏ వ్యాధీ లేదని నిర్ధారించుకున్నాడు జమీందారు.

బలానికి మందులు రాయించి వాడినా పిల్లవాడు బలహీనంగానే ఉండేవాడు.

ఒక రోజు జమీందారు తన కొడుకును తీసుకుని పొలాల వైపు వాహ్యాళికి వెళ్లాడు.

అక్కడ రైతు తన కొడుకుతో ఆనందంగా పాడుకుంటూ ఉండగా చూశాడాయన. ఆ పిల్లవాడు ఎంతో ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉన్నాడు.

కాసేపయ్యాక రైతు పాకలోంచి ఓ ముంత తీసుకొచ్చి అందులోని ద్రవాన్ని తన కొడుక్కి తాగించి కండువాతో మూతి తుడిచాడు.

'ఏమిటది?' కుతూహలంగా అడిగారు జమీందారు గారు.

రైతు నవ్వేసి, 'తాతలనాటి అమృతం,' అన్నాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ జమీందారు తన కొడుకు అలాగే బలహీనంగానే ఉండటం రైతు కొడుకు మాత్రం రోజురోజుకీ మరింత హుషారుగా

పి.వి. సత్యనారాయణ

తయారవడం గమనించి ఉండబట్ట లేక రైతును అడిగేశాడు.

'ఆ అమృతం మా వాడికి కూడా రోజూ ఇవ్వకూడదా? ఎంత ఖరీదయినా సరే చెల్లిస్తాను.'

'ఖరీదుకేం గాని తమ బోటి పెద్ద లకి మా అమృతం నచ్చదేమో బాబూ,' సందేహించాడు రైతు.

'తప్పకుండా నచ్చుతుంది. నాకు నా బిడ్డ ఆరోగ్యం ఆనందం ముఖ్యం,' అన్నాడు జమీందారు.

'అయితే లోపలికి రండి బాబయ్యా! మా అమృతం ఎలా తయారు చేస్తామో చూపిస్తాను,' అని జమీందారుని పాక లోపలికి తీసికెళ్లాడు రైతు. లోపల పొయ్యి మీద కుండలో కుతకుతా ఉడుకుతున్న రాగి అంబలిని చూపిస్తూ, 'అయ్యా! తాతలనాటి నుంచి మేం తాగే పేదవాడి అమృతం ఇదే. ఎదిగే పిల్లలకు, ఎదిగిన వారికీ కూడా ఈ చోడి అంబలి ఒంటికి రక్తాన్ని పట్టించి మంచి బలాన్నిస్తుంది. మరి చిన్న దొర వారికి ఇది నచ్చుతుందో లేదో చూడండి,' అన్నాడు వినయంగా రైతు.

కాని అప్పటికే రైతు కొడుకు తనతో ఆడుకుంటున్న జమీందారు కొడుక్కి తండ్రి అంతక్రితమే తనకిచ్చిన అంబలిని ఇంకో ముంతలో పోసి అందించాడు.

ఇంట్లో ఖరీదయిన ఆహారాన్ని తినేందుకు పేచీలు పెట్టే జమీందారు కొడుకు చిత్రంగా ఆ అంబలిని మహానందంతో తాగడం చూసి విస్తుపోయాడు జమీందారు.

నెలరోజులు గడిచేసరికి జమీందారు కొడుకు కూడా రైతు కొడుకులాగే ఉత్సాహంగా ఎదగడం చూసి 'ఔరా, ఏమి ఈ అమృతం మహిమ!' అనుకున్న జమీందారు తన పొలంలో కూడా రాగులపంట వేయించాడు.



# పాట కథ

భూమ్మీద హఠాత్తుగా కరువు వచ్చి పడింది. మనుషులంతా కరువు దెబ్బకు తిండిలేక అల్లల్లాడిపోయారు. దేవుడికి ఆశ్చర్యం కలిగింది.

'భూమ్మీద అన్ని సహజ వనరులూ పుష్కలంగా ఉన్నాయి. సమర్థులైన మనుషులూ ఉన్నారు. బంగారు పంటలు పండే నేల ఉంది. మరి ఎందుకు కరువు వచ్చి పడింది.' అంటూ అడిగాడు దేవుడు, దేవదూతతో.

'ఈ కరువుకు కారణం విసుగు. మనుషుల్లో మీరు కల్పించిన విసుగు అనే మానసిక స్థితి వల్ల, చేసిన పనే చేయడానికి విసుగు పుట్టి, వ్యవసాయం మానుకున్నారు. కొత్త కొత్త పనులకి ఎగబడ్డారు. అందుకే ఈ కరువు..' అంటూ వివరించాడు దేవదూత.

'మనుషుల్లో విసుగుపోయి పనులంటే ఉత్సాహం పుట్టకపోతే, అది మానవ మనుగడకే ప్రమాదం,' అని కూడా అన్నాడు దేవదూత. 'అవునవును.. పాట పుట్టే సమయం వచ్చింది. మరి..,' అని నవ్వుతూ అన్నాడు దేవుడు. 'పాటా?...' అంటూ ఆశ్చర్యపోయాడు దేవదూత.

'అవును. ఇకనుంచీ మనుషులు పనులు చేస్తున్నప్పుడు అప్రయత్నంగా పాట పుడుతుంది. పాటతో పాటు పదం కదులుతుంది. పనితో పాట, పాటతో పనీ కలిసి మెలిసి జమిలిగా సాగుతాయి. దాంతో ఎంత పని చేసినా మనుషులకి విసుగే కలగదు...' అన్నాడు దేవుడు. 'చాలా బావుంది. మరి, అసలు పాటంటేనే మనిషికి విసుగు కలిగితే...'

'పాట గొప్పదనం అదే. అది ఎప్పటికీ మనిషికి విసుగు కలగని విధంగా నేను వరం ఇస్తున్నాను,' అన్నాడు దేవుడు. అప్పుడు పుట్టిన పాట వ్యవసాయ పనుల్లో లొల్లాయిపదంగా, జనపథంలో జానపదంగా, తనని సృష్టించిన దేవుడి కీర్తిని కొనియాడే కీర్తనగా, అలనాటి నుంచి ఈ నాటి వరకూ అప్రతిహతంగా తన జైత్రయాత్రను కొనసాగిస్తోంది.

పాటకీ, పథానికీ దేవుడు పెట్టిన అవినాభావ సంబంధం వల్లే, పాటతో పాటు, వేల ఏళ్లుగా మన పెద్దల కాళ్లు కదలడం వల్లే.. ఇప్పటిక్కూడా పాట వినగానే అప్రయత్నంగా మన పాదం కదులుతుంది. తాళం వేస్తుంది.

– పి. వెంకటేశ్వర రావు





# శిథిలాలయం - 31

(వృశ్చిక నాయకుడు శిఖిముఖితో కలియబడి ఓడిపోయాడు. శిఖిముఖి అతణ్ణి క్షమించి కొండ కింది లోయలోకి బయలుదేరాడు. అక్కడ వాళ్లు చెట్టు కింద ఉన్న ఒక ఏనుగుల మందను పారదోలారు. చెట్టు పైన కనిపించే ఆకారం నాంగ్‌సోమ్ దేమో అన్న అనుమానం కలిగి జాంగ్‌లా గబగబా చెట్టు పైకి ఎగబాకి పోయాడు. తరవాత)

శిఖిముఖీ వాళ్లు చెట్టు కింద నిలబడ్డారు. జాంగ్‌లా గుబురుగా ఉన్న కొమ్మల్లోంచి ఆశ్చర్యంగా చిన్న కేక పెట్టి, 'శిఖి దొరా! ఇక్కడున్నది నాంగ్ సోమే! స్పృహలేదు. కాని ఊపిరాడుతున్నది. మరొకళ్లిద్దర్ని పంపితే, జాగ్రత్తగా కిందికి దించవచ్చు,' అన్నాడు.

ఆ మాటలు వింటూనే వృశ్చిక జాతివాళ్లిద్దరు చెట్టెక్కారు. తరవాత కొద్ది సేపటికి జాంగ్‌లా, వాళ్లిద్దరూ కలిసి చచ్చినట్లు పడివున్న నాంగ్‌సోమ్‌ను లతలు పెనవేసి కట్టిన తాళ్లతో నిదానంగా నేలమీదికి జార్చారు.

శిఖిముఖీ, విక్రమకేసరీ కలిసి నాంగ్ సోమ్ బతికి ఉన్నాడో లేడో అని పరీక్షించబోయేంతలో, వృశ్చిక నాయకుడు అల్లంత దూరంలో ఉన్న పొదలోంచి ఇంత ఆకు తెచ్చి, దాని పసరును నాంగ్ సోమ్ ముక్కుల్లో పోశాడు. మరుక్షణమే నాంగ్ పెద్దగా తుమ్మి, ఎగిరి లేచి కూర్చున్నాడు.

'నాంగ్! కొండమీద నుంచి లోయలోని చెట్టుకొమ్మల మీద పడి చిన్న దెబ్బలు తగిలినా, ప్రాణాలతో బయట పడ్డావ్!' అన్నాడు శిఖిముఖి.

నాంగ్‌సోమ్ పిచ్చివాడిలా చుట్టూ

దాసరి సుబ్రహ్మణ్యం




ఉన్న వాళ్లనోసారి కలియచూసి, ‘శిథిలాలయం! శిథిలాలయం! అదుగో!’ అంటూ గుంపుగా ఉన్న చెట్ల కేసి చేయి చాపి, లేచి పరిగెత్తబోయాడు.

శిఖిముఖి అతని నడుం పట్టుకుని లవంతాన కూర్చోబెట్టి, విక్రమ కేసరితో, ‘నాంగ్‌సోమ్‌కు ఇంకా ఆ వెర్రి వెలగ పండు విషం దిగినట్లు లేదు. ఏవిటి చేయటం?’ అన్నాడు.

విక్రమ కేసరి ఏదో చెప్పబోయేంతలో చెట్లలో నుంచి ‘రక్షించండి! రక్షించండి!’ అన్న కేకలు వినిపించినై.

అందరూ అటుకేసి తలలు తిప్పారు. ఎర్రగండు కూడా పెద్దగా మొరిగింది. శిఖిముఖి ఆశ్చర్యంగా, ‘అది పిశాచం అరుపా? లేక శిథిలాలయ పూజారి కంఠధ్వనా?’ అంటూ ఒరలోని కత్తి దూసి, ఆ ఆర్తనాదం వచ్చిన దిక్కుగా బయలుదేరాడు.

వటవృక్షాల నీడల్లో నుంచి శిఖిముఖి వెలుగులోకి వచ్చి ఆర్తనాదం వచ్చిన దిక్కు కేసి పరీక్షగా చూసేంతలో తిరిగి ‘రక్షించండి’ అన్న అరుపు వినబడింది. ఈసారి ఆ కంఠ స్వరంలో మొదట ఉన్న దృఢత్వం లేదు. కొన ఊపిరితో ఉన్నవాడి మూలుగులా ఉన్నది.

‘కేసరీ! ఆ గొంతు శిథిలాలయ పూజారిదే, అనుమానం లేదు. వాడు నిజంగానే ఏదో ప్రమాదంలో చిక్కుకున్నట్లుంది,’ అన్నాడు శిఖిముఖి.

కేసరి జవాబివ్వబోయేంతలో ఎర్రగండు పొదలమీంచి దూకి ముందుకుపోయి పెద్దగా మొరగసాగింది. అందరూ దానివెనకగా పొదల్లో నుంచి బయటకి వెళ్లారు. వాళ్లకు అక్కడ కనబడిన దృశ్యం భయాశ్చర్యాలను కలిగించింది. ఒక పెద్ద సర్పం శిథిలాలయ పూజారిని దాదాపు మోకాళ్ల వరకు మింగింది. పూజారి రెండు చేతులతోనూ నేలమీద ఉన్న ఏదో వస్తువును గట్టిగా పట్టుకుని, అటు ఇటూ కదులుతూ పెద్దగా అరిచేందుకు ప్రయత్నిస్తున్నాడు.

‘ఈ పూజారి ఎంత దుర్మార్గుడైనా, వీణ్ణి, పాము బారినుంచి రక్షించడం మన కనీస మానవధర్మం,’ అంటూ

శిఖిముఖి పరుగు పరుగున ముందుకు పోయి, కత్తితో పాము నడుం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు పాము అటూ ఇటూ పొర్లింది. దాని నోటిలో ఉన్న శిథిలాలయ పూజారి బయటపడ్డాడు. శిఖిముఖి వెంట ఉన్న వృశ్చిక జాతివాళ్లు తమ చేతుల్లో ఉన్న రాతి ఆయుధాలతో పామును ఎడా పెడా బాదసాగారు.

శిఖిముఖీ, విక్రమకేసరీ పూజారిని సమీపించారు. పాము నోటినుంచి బయటపడిన అతడి కాళ్లు రెండూ రక్తం ఓడుతున్నవి. పాదాల ఆకారమే పూర్తిగా మారిపోయింది. అవి మాంసపు ముద్దల్లా ఎర్రగా మెరుస్తున్నవి. పూజారి బాధతో గిలగిల కొట్టుకుంటూ మూలుగుతున్నాడు. అతడి చేతులు ఏదో వస్తువును బలంగా పట్టుకునే ఉన్నవి.

శిఖిముఖి వంగి అతణ్ణి లేవనెత్తబోయేంతలో పూజారి చిన్నగా అరిచి, 'శిఖీ, నన్నిక్కడే చావనియ్యి, నేనెలాగైతేనేం, చచ్చే ముందు శిథిలాలయాన్ని కనుగొన్నాను. నా మంత్రశక్తీ, శిథిలేశ్వరిపై నా భక్తీ వృథా పోలేదు,' అన్నాడు.

'నువ్వు శిథిలాలయాన్ని కనుక్కున్నావా! ఎక్కడుందది? మా కంటికి కనబడదేం! చావబోయే ముందు కూడా ఎందుకు దంభాలు పలుకుతావు?' అన్నాడు శిఖిముఖి కొంచెం కోపంగా.

శిఖిముఖి అలా అనగానే, పూజారి తల ఎత్తి సూటిగా అతడి కళ్ళలోకి చూశాడు. తరవాత ఒక క్షణం ఆగి, 'నేను దుర్మార్గుడిననీ, మోసగాణ్ణనీ నీ అభిప్రాయం! అంతేనా? నేను శిథిలేశ్వరి కోసమే తుచ్ఛమానవులు కొందరికి హాని కలిగించవలసి వచ్చింది. ఆ



దేవి ముందు ఈ మానవులెంత! ఇదిగో శిథిలాలయ గోపర కలశం! చూడు!' అంటూ చేతులు రెండూ పైకెత్తాడు.

అంతవరకూ శిఖిముఖీ, విక్రమకేసరీ పూజారి చేతులతో బలంగా పట్టుకుని ఉన్న వస్తువు కేసి చూడలేదు. ఇప్పుడు వాళ్లకు సూర్యకాంతిలో ధగధగ మెరుస్తున్న కలశం ఒకటి కంటబడింది. వాళ్లక్కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. ఆ కలశాన్ని చూస్తూనే వృశ్చిక జాతి వాళ్లందరూ నేల మీద మోకరిల్లారు.



ఒకటి రెండు క్షణాలు ఎవరి నోటి నుంచీ మాట వెలువడలేదు. శిఖిముఖికి ఇదేదో శిథిలాలయ పూజారి తమ మీద ప్రయోగించిన కనుకట్టు విద్య ఏమో అన్న అనుమానం కలిగింది. విక్రమకేసరి ఏమాలోచించాడు ఏమో, కలశాన్ని రెండు చేతులతోనూ బలంగా పట్టుకుని పైకెత్తాలని చూశాడు. కాని అది కదలలేదు. అంత ప్రాణాపాయ స్థితిలోనూ శిథిలాలయ పూజారి అది చూసి, వికవికమంటూ నవ్వి, 'ఆ కలశమేదో నేలమీద పళ్లెలా బోర్లించి ఉన్నదనుకుంటున్నావా, చినకేసరీ! ఇప్పుడు చెబుతున్నాను. నేను నీ తాతనెరుగుదును. ఆయనలో ఉన్న మొండితనం నీలోనూ ఉన్నది,' అన్నాడు.

'నువ్వనే దేమిటి పూజారీ! శిథిలాలయం గోపుర కలశం వరకూ భూమిలో కూ[illegible]యిందనా?' అని అడిగాడు శిఖిముఖి.

'ఎన్నో ఏళ్ల క్రితం భూకంపం కారణంగా అదే జరిగింది. ఆలయం కొన్ని అడుగుల లోతు భూమిలోకి దిగిపోయింది. పక్కన ఉన్న కొండరాళ్లు దొర్లి దాన్ని కప్పివేసినై. ఆ రాళ్లూ రప్పలూ తొలగించావంటే శిథిలాలయం అందులోని శిథిలేశ్వరీ దేవీ కనబడుతుంది. శిఖీ! అయినా మీ శబర జాతివాళ్లకు ఆ దేవితో పనిలేదు కదా, అక్కడ దొరికే బంగారం తప్ప!' అన్నాడు పూజారి ఈసడిస్తున్నట్లుగా.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూశాడు. చావబోయే ముందు కూడా శిథిలాలయ పూజారి తమ మీదకు ఇభ్యుజాతి వాళ్లనూ, వృశ్చిక జాతివా




ళ్లనూ రెచ్చకొట్ట చూస్తున్నాడని వాళ్లిద్దరూ గ్రహించారు. పూజారిని ఏమి చేయటమా అని వాళ్లు ఆలోచించేంతలో, నాంగ్‌సోమ్ అడుగులో అడుగు వేసుకుంటూ కలశం దగ్గరకు వచ్చి, రెండు మూడు క్షణాలు కన్నార్పకుండా చూసి దాన్ని తాకాడు. ఆ వెంటనే అతడిలో ఏదో కొత్త శక్తి ప్రవేశించినట్లయింది.

నాంగ్‌సోమ్ ఒకసారి పెద్దగా నిట్టూర్చి, 'కేసరిదొరా! ఇప్పటికి నాకు వెర్రివెలగపండు తిక్క వదిలిపోయింది. ఈ కలశంలో ఏదో మహత్తున్నది. దీని అడుగున ఆలయం ఉన్నదనేందుకు సందేహం లేదు. రాళ్లూ రప్పలూ తొలగిద్దాం,' అన్నాడు.

'ఇది చాలా కష్టంతో కూడిన పని, అయినా తప్పదు. ఏమంటావ్, శిఖీ?' అని అడిగాడు. విక్రమకేసరి.

'ఎంత కష్టకార్యమైనా మనం సాధించి తీరవలసిందే, ఇంత దూరం వచ్చి శిథిలాలయంలో ప్రవేశించకుండా ఎలా వెళ్లటం? మీ తాతగారి ఆత్మకు శాంతి కలిగించవద్దా? మీ తండ్రిగారి ఆజ్ఞ నెరవేర్చవద్దా? కాని ఈ పూజారి మాట ఏమిటి? వీడి బంట్లు ఎక్కడ? తనవాళ్లను ఉసికొల్ప జూస్తున్నాడు,' అన్నాడు శిఖిముఖి.

నాంగ్‌సోమ్, శిఖిముఖి అభిప్రాయం ఏమిటో గ్రహించినవాడిలా నవ్వుతూ ముందుకు వచ్చి రహస్యం చెబుతున్న వాడిలా 'కాళ్లు రెండూ నజ్జునజ్జయిపోయిన పూజారి వాయకమ్మి త్వరలోనే చస్తాడు. వాడి మాటలు మీరు పట్టించుకోకండి. నాకూ, ఈ కలశం శిథిలాలయానికి సంబంధించినదే అన్న నమ్మిక ఉన్నది,' అన్నాడు.

'మనం ఇక్కడ గుట్టగా పడిపోయిన చిన్నా పెద్దరాళ్లను ఎత్తి దూరంగా పారేస్తే తప్ప వాటి అడుగున ఉన్న ఆలయాన్ని చేరలేం. ఇది చాలా రోజుల మీద జరగవలసిన పని. మనం ఈ దాపులనే నివాసాలు ఏర్పర్చుకోవలిసి ఉంటుంది. అందుకు అవసరం అయిన ఇళ్లు కొమ్మలతో, ఆకులతో ముందు నిర్మించుకుని తరవాత ఈ పని ప్రారంభిద్దాం,' అన్నాడు శిఖిముఖి.



నాంగ్‌సోమ్ తలవూపి వృశ్చిక జాతి వాళ్ల కేసి చూశాడు. వృశ్చిక నాయకుడు చేతులు కట్టుకుని శిఖిముఖి ముందుకు వచ్చి నిలబడ్డాడు. శిఖిముఖి అతడు చేయవలసిన పని చెప్పాడు. వాడు అంతా విని 'శిఖి దొరా! ఆ ఇల్లు కట్టటం ఏమంత పెద్ద పని కాదు. మాతమందిరాన్ని కప్పిన రాళ్లను తొలగించటమే బహు కష్టం. ఒకటి రెండు మచ్చిక చేసిన ఏనుగులుంటే పని చులకన అవుతుంది.' అని శిథిలాలయ పూజారిని వేలితో చూపుతూ,' వాడు ఎలానూ చస్తాడు. కాని ముందూ మాకూ లేకుండా చావనివ్వడం బావుంటుందా?' అన్నాడు.

'వాతైతే ఏదైనా చికిత్స చేసి వాడి బాధ కాస్త తగ్గించండి. నేనామాటే మరిచాను,' అన్నాడు శిఖిముఖి.

వృశ్చిక జాతి నాయకుడు చెప్పగానే అతడి అనుచరులు చెట్లలోకి పోయి ఏవో ఆకులు అవీ తెచ్చి పూజారి కాళ్లకు కట్లు కట్టబోయారు. పూజారి గట్టిగా అభ్యంతరం చెబుతూ, అల్లంత దూరంలో ఉన్న ఒక చెట్టుకొమ్మకు ఉయ్యాల వేసి తనను అందులో కూర్చోబెట్టమన్నాడు.

'నేను మరి నాలుగైదు సూర్యోదయాల కంటే ఎక్కువ చూడలేను. ఈ లోపల మీరు శిథిలాలయాన్ని వెలికి తీయండి. శిథిలేశ్వరిన్ని చూసి సుఖంగా ప్రాణాలు వదులుతాను,' అన్నాడతను.

చావబోయే వాడి కోర్కె నెరవేర్చటం ధర్మం అని శిఖిముఖీ, విక్రమకేసరీ వృశ్చిక జాతివాళ్లకు అలాగే చేయమని చెప్పారు.

వాళ్లు శిథిలాలయ పూజారి కాళ్లకు కట్లు కట్టి, దాపులనున్న ఒక చెట్టుకొమ్మకు అమర్చిన ఉయ్యాలలాంటి దాంట్లో అతణ్ణి కూర్చోబెట్టారు.

ఆ సాయంకాలానికల్లా అందరూ కలిసి చెట్ల కొమ్మలు నరికి భూమిలో పాతి, వాటి మీద పెద్ద పెద్ద ఆకులు కుట్టి, వృశ్చిక జాతి వాళ్లూ, శిఖిముఖీ అతడి అనుచరులూ వుండేందుకు వీలుగా చిన్న చిన్న గుడిశెల్లాంటివి తయారు చేశారు. ఆ రాత్రి వాళ్లెవరికీ సరిగా నిద్రల్లేవు. చుట్టూ అడవి ఏను

గులు ఘీంకరించటం, క్రూరమృగాల అరుపులూ వాళ్ల కర్ణపుటాలను బద్దలు చేయసాగినై. గుడిసెల చుట్టూ నెగళ్లు వేసుకుని, కునికిపాట్లు పడుతూ వాళ్లు సూర్యోదయం వరకూ కాలం గడిపారు.

మరుసటి రోజు సూర్యోదయం నుంచీ అందరూ కలిసి పెద్ద పెద్ద రాళ్లకు అడవి తీగలతో అల్లినమోకులు బిగించి కట్టి, దూరంగా లాక్కుపోయి గుట్టగా వేయసాగారు. అది ఎంతో శ్రమతో కూడిన పని. దానికి అంతరాయం కలిగిస్తూ, మధ్యమధ్య అడవి ఏను గులు కొన్ని అక్కడికి వచ్చి ఘీంకరిస్తూ వాళ్ల మీద పడేందుకు ప్రయత్నించసా గినై. అలాంటి సమయాల్లో అందరూ పనులు మాని ఏనుగులను బెదర కొట్టేందుకు డప్పులు వాయించటం, రాళ్లు విసరటం చేయసాగారు.

సూర్యుడు పడమటి దిక్కుకు వాలే వరకూ వాళ్ల పనికి పెద్ద ఆటంకం ఏమీ కలగలేదు. శిఖిముఖి 'ఇక ఆ నాటికి పని విరమించి, పంటపనుల సంగతి చూద్దాం,' అనుకునేంతలో, హఠాత్తుగా ఆ ప్రదేశానికి చుట్టూ ఉన్న గుట్టల మీద నాలుగు ఏనుగులు కనిపించనై. వాటి మీద పెద్ద పెద్ద త్రిశూలాలు ధరించిన భయంకరాకారులున్నారు.

శిఖిముఖీ, విక్రమకేసరీ తమ అను చరుల్ని హెచ్చరించి ఆయుధాలు చేత పట్టూబోయేంతలో, ఏనుగుల మీద ఉన్నవాళ్లు పెద్దగా, 'ఎక్కడి వాళ్లక్కడ కదలకుండా నిలబడండి. మా వెనక నూరు ఏనుగుల మీద మరికొందరు అఘోరీలు వస్తున్నారు. పారిపోజూస్తే మీ ప్రాణాలు దక్కవు, జాగ్రత్త!' అన్నారు. శిఖిముఖీ, విక్రమకేసరీ ఇప్పుడు ఏమి చెయ్యటమా అని, నాంగ్‌సోమ్ కేసీ, వృశ్చిక నాయకుడి కేసీ తలలు తిప్పారు. వాళ్లిద్దరూ తమ చేతుల్లోని ఆయుధాలు పైకెత్తి త్రిశూ లాలు ధరించిన వాళ్లకేసి బయలుదే రారు. (ఇంకా ఉంది)



# ఆచరణ

పేరిపాలెం రామాలయంలో పురాణ ప్రవచనాలు చెబుతూ, చుట్టుప్రక్కల పదిపదిహేను గ్రామాల వాసుల చేత మన్ననలందుకునే భద్రపాదుడు, నది ఒడ్డున శిష్యులతో స్నానం చేస్తుండగా, పెద్ద అలవచ్చి అతడిని లోనికి లాక్కుపోయింది.

ఆయన పెద్దగా కేకలు వేయసాగాడు. శిష్యులందరికీ ఈత వచ్చు. కానీ, నదిలో దూకి గురువుగారిని రక్షించే సాహసం చేయలేక, 'కాపాడండి కాపాడండి..' అంటూ కేకలు మాత్రం వేయసాగారు.

అదాట్న పోతున్న జాలరి మంగయ్య, భద్రపాదుడి అవస్థ చూసి, మరేం ఆలోచించకుండా, ప్రాణాలకు తెగించి నదిలో దూకి, అతికష్టం మీద ఆయన్ని పడేశాడు.

శిష్యులంతా మంగయ్యను చుట్టుముట్టి, 'నువ్వు కాపాడింది ఎంత గొప్ప వ్యక్తినో తెలుసా..' అంటూ గురువు గారి గొప్పదనం గురించి ఏకరువు పెట్టసాగారు.

తేరుకున్న భద్రపాదుడు శిష్యుల్ని వారించి, మంగయ్య గురించి అన్ని వివరాలు అడిగి తెల్సుకుని, 'ఇక్కడ తన గొప్పదనం ఇతరులు తెలుసుకోవలసిన వ్యక్తి ఎవరన్నా ఉన్నారూ అంటే - అది మంగయ్య గారే, ఎందుకంటే వేయి ధర్మసూక్ష్మాలు తెలిసినవానికంటే, తనకు తోచిన ఒక్క ఆపద్ధర్మాన్ని ఆచరించిన వ్యక్తే ఘనుడు!' అంటూ మంగయ్య కేసి చేతులు జోడించాడు.

అది అర్థమయి శిష్యులు, గురువును కాపాడటానికి సాహసించని తమ ఆచరణ లోభత్వానికి సిగ్గుతో తలలు దించుకున్నారు. - భీమవరపు పురుషోత్తం





# కెరటాల కరణం

బ్రిటిష్ గవర్నమెంట్ అధికారంలోకి వచ్చిన కొత్తల్లో కెరటాల అగ్రహారంలో కామశాస్త్రి కరణీకం చేసేవాడు. కామన్న సామాన్యుడు కాడు. యోధానుయోధుడు. లంచాలు దారుణంగా పుచ్చుకునేవాడు. వాళ్లూ వీళ్లూ అనే తారతమ్యం లేకుండా పుచ్చుకునేవాడు.

ఆ గ్రామంలో ఒక కలెక్టరుకు భూమి ఉంది. ఆ భూమికి శిస్తు కట్టడానికి డబ్బు పంపించారు. పట్టా మామూలు ఇవ్వందే శిస్తు జమ కట్టుకోనని తిప్పి పంపించేశాడు కరణం.. కలెక్టరు దొరవారు ఎన్ని ప్రయత్నాలు చేసి లాభం లేకపోయింది.

ఇదే సమయంలో గ్రామంలోని యావన్మందీ, 'ఈ కరణంగారు లంచాలు పుచ్చుకుంటున్నారు! వీరి బాధ భరించలేకున్నాం,' అని పిటిషన్ పెట్టుకున్నారు. పిటిషన్ రివిన్యూ బోర్డుకూ, పైవారికీ వెళ్లింది. ఒక కాపీ లండనులోని ప్రీవీ కౌన్సిలుకు కూడా పంపారు.

ఇటువంటి వాడివల్ల ముప్పు వస్తుందని, కరణంగారికి ఏమి శిక్ష విధించాలో ఆలోచించడానికి ఒక కమిటీని వేశారు. ఒక సంవత్సరం పాటు మహాసముద్రం మీద ఒక లంకలో వదిలిపెట్టి, సంవత్సరానికి కావలిసిన గ్రాసమూ, సామాన్లు ఇచ్చేటట్టు నిర్ణయం జరిగింది.

ఈ ఉత్తరువు ఇండియా గవర్నమెంటుకు చేరగానే కరణంగారికి తాకీదు వచ్చింది. కావలసిన సామగ్రి కోసం దరఖాస్తు పెట్టుకోమన్నారు. కరణంగారు ఇతర సామాన్లతోబాటు పది రీముల కాగితాలూ, సిరాబుడ్లూ, కలాలూ, పెన్సిళ్లూ కావాలని దరఖాస్తు పెట్టుకున్నాడు. ఈ జాబితా చూసి కరణం రామకోటి వ్రాసుకుంటాడు

చల్లా లక్ష్మి

కాబోలనుకుని అధికార్లు అన్నీ ఇప్పించి, స్టీమరు ఎక్కించి పంపారు.

కరణంగారు లంక చేరి, తెల్లకాగి తాలన్నీ పుస్తకాలు కుట్టుకుని, గళ్లు గీసుకుని, వ్రాత మొదలుపెట్టాడు. 10 కెరటాలు ఒడ్డుకు వచ్చినవి. అందులో 8 కెరటాలు తిరిగిపోయి నవి. బకాయి 2 కెరటాలు.. ఈ విధంగా తన ఇష్టం వచ్చినట్లు వ్రాసుకుపోతు న్నాడు. పుస్తకాలు నిండిపోతున్నాయి.

ఇంతలోనే ఈస్టిండియా కంపెనీ వారి వర్తకపు ఓడ ఆ లంకకు వచ్చింది. కరణం గారు దాన్ని ఆపు చేసి, వంద రూపాయలకు చిత్తు రసీదు వ్రాసి, సొమ్ము తెమ్మని అడిగాడు. స్టీమరులో ఉండే దొర, 'ఈ రసీదేమిటి? నీవె వరు?' అని అడిగాడు.

'సొమ్ము చెల్లించనిదే స్టీమరు రేవులో నుంచి కదలటానికి వీల్లేదు. నేను కెరటాల కరణాన్ని, ఇవిగో నా రికార్డు పుస్తకాలు,' అన్నాడు కరణం గారు.

దొర నూరు రూపాయలు ఇచ్చి రసీదు వెనుక ఇంగ్లీషులో 'కెరటాల కరణానికి ఇచ్చిన సుంకం,' అని వ్రాసుకున్నాడు. అది మొదలు కరణం అటుగా వచ్చిన ప్రతి ఓడ నుంచీ ఖచ్చి తంగా వందేసి రూపాయలు వసూలు చేశాడు. ఆయన ఇచ్చిన రసీదులన్నీ ఇంగ్లండులో హెడ్డాఫీసుకు చేరాయి. అక్కడి అడిటర్లు 'అన్నీ చిత్తురసీదులే ఉన్నాయి. అచ్చు రసీదులు పంపక పోతే లెక్కలు తేలవ'నీ ఇండియాకు ఘాటుగా ఉత్తరం రాశారు.

ఈ ఉత్తరం ఇండియా గవర్నమెంటు నుంచి, గవర్నరుకూ, రివిన్యూ బోర్డుకూ వెళ్లి చివరకు జిల్లా కలెక్టరు వద్దకు చేరింది. తీరా విచారిస్తే చిత్తు రసీదు లిచ్చినవాడు శిక్ష అనుభవిస్తున్న కెర టాల కరణం కామశాస్త్రి అని తేలింది. ఇంత సమర్థుడైన వాడికి శిక్ష అనవస రమనీ, కరణాల మామూళ్లు లంచాలు కావనీ ప్రభుత్వం నిర్ణయించి, కామ శాస్త్రి శిక్ష రద్దు చేసింది.



# పనికిరాని ప్రఖ్యాతి

కళింగ దేశపు రాజు అపర ధార కర్ణుడు. నిరతాన్న ప్రదాత. రోజూ వేలాది బీదజనానికి అన్నదానమూ, బ్రాహ్మణులకు సువర్ణదానమూ చేస్తూండేవాడు. మహా దాతగా ఆయన కీర్తి దేశదేశాలా పాకింది.

కళింగ రాజు కొక కుమార్తె ఉన్నది. ఆమెకు యుక్తవయసు వచ్చింది. తగిన వరుడి కోసం అన్వేషిస్తుండగా కాంభోజరాజు కొడుకు కళింగ రాజు కుమార్తెకు అన్ని విధాలా తగినవాడని తెలిసింది.

కళింగరాజు కాంభోజరాజు వద్దకు దూతలను పంపాడు. వాళ్లు వెళ్లి కాంభోజరాజుతో, 'మా మహారాజు గారి ఖ్యాతి అందరికీ తెలిసినదే. ఆయన లక్షలాది పేదసాదలకూ, బ్రాహ్మణులకూ నిత్యమూ దాన ధర్మాలు చేస్తూ ఉంటారు. వారి కుమార్తెను తమ కుమారుడికి చేసు కుంటే ఎంతైనా బాగుంటుంది,' అన్నారు.

'మీ దేశం నిండా పేదవాళ్లే ఉన్నట్లు కనబడుతుంది. అలాంటి పేద దేశంతో మేము సంబంధం చేసుకోము,' అన్నాడు కాంభోజరాజు.





# ఏది గొప్ప?

ఒకసత్రంలో ముగ్గురు ఉద్దండపిడుగులు కలిశారు. వారిలో ఒక వ్యక్తి హస్తవాసి కలిగిన వైద్యుడు. రెండవ వ్యక్తి మహా పండితుడు. మూడవ వ్యక్తి అత్యంత ధనికుడు.

ముగ్గురూ తమ గొప్పల్ని గురించి వాదించుకోసాగారు. 'డబ్బులోనే లోకం ఉంది. డబ్బు చెప్పినట్లే లోకం ఆడుతుంది,' అన్నాడు ధనికుడు.

'పొరపాటు. అసలు మనిషి బ్రతికుంటే కదా అన్ని సుఖాలు అనుభవించేది. మనిషి ప్రాణం నిలిపే మా వైద్యం గొప్ప,' చెప్పాడు వైద్యుడు.

'నూరేళ్లు బ్రతికినా, చేతినిండా డబ్బున్నా విద్య లేనివాడు పశువుతో సమానుడు,' చెప్పాడు పండితుడు.

వాదనంతా విన్న సత్రపు యజమాని 'మీ వాదన మాటలతో తేలేది కాదు. ఏదైనా పరీక్ష పెట్టుకుని ఎవరు గొప్పవారో తేల్చుకోండి,' సలహా ఇచ్చాడు.

ముగ్గురూ అందుకు అంగీకరించి ఊళ్లోకి బయలు దేరారు. ఆ సత్రం లోనే ఒక మూలగా పడుకుని ఉన్న పదేళ్ల కుర్రాడు వాళ్ల వద్దకు వచ్చి, 'అయ్యా, నాకు రెండు రోజుల నుండి తిండి లేదు. అనాథను నన్ను మీ వెంట తీసుకుపోండి. ఏ పనికైనా సాయం ఉంటాను,' అన్నాడు.

వాడి ముఖం చూడగానే జాలి కలిగి, వాడిని కూడా తమ వెంట తీసుకు వెళ్లారు.

గ్రామం మొదట్లోనే ఒక పాత భవంతి వీళ్ల కంటబడింది. ఆ ఇంట్లో

సి.హెచ్.డి. లక్ష్మణరావు



అడుగు పెట్టగానే లోపలనుండి ఆగకుండా దగ్గుతున్న కంఠం విన బడింది. నలుగురూ ఆ మూలగది కేసి వెళ్లారు. ఓ ముసలితాత పడు కుని ఉన్నాడు.

'ఏం తాతా! ఇంట్లో ఎవరూ లేరా?' అడిగాడు కుర్రవాడు.

వృద్ధుడు నిట్టూర్చి 'ఔను బాబూ! ఎవరూ లేరు నేను ఏకాకిని,' అన్నాడు.

వైద్యుడు వృద్ధుడి నాడి పట్టుకుని చూశాడు. మంచి మందులు వాడితే త్వరలోనే కోలుకోవచ్చు అనుకున్నాడు. ఈ లోగా ఇద్దరూ ఇల్లు చుట్టూ చూసి వచ్చారు. ఒకప్పుడు బాగా బ్రతికిన ఇల్లు లాగా ఉంది అనుకున్నారు.

'ఒకప్పుడు బాగా బ్రతికి ఉండిన వాడే! కాని అవసాన దశలో దరిద్రం పట్టుకుని పీడిస్తుంది. ఇప్పుడు కష్టాలు పడుతున్నాడు,' అన్నాడు ధనికుడు.

'ముసలాయనకి విద్య తెలిసినట్లు లేదు. తెల్సి ఉంటే ఇల్లు ఇలా చిన్న బోయేది కాదు. విద్యావంతులయిన మిత్రులతో కళకళలాడుతూ ఉండేది,' అనుకున్నాడు పండితుడు.

ఇలా ఆలోచిస్తున్న ముగ్గురికీ ఒకే విధమైన ఆలోచన కలిగింది. ఆ వృద్ధుడి ద్వారానే తమ ఆధిక్యత నిరూపించుకోవాలనుకున్నారు. వాళ్లు తమ కోర్కెను బయటపెట్టేసరికి అందకు ముసలాయన సంతోషంగా ఒప్పుకున్నాడు.

మర్నాటినుంచి వైద్యుడు తన వైద్యం మొదలు పెట్టాడు. ముసలా యనకి పూటకొక మోతాదు ఇస్తూ, ఏవేవో మందులు తాగిస్తూ వచ్చాడు. మూడు రోజుల్లో వృద్ధుణ్ణి మామూలు మనిషిని చెయ్యాలని పట్టుదలతో ఉన్నాడు.

అలాగే ధనికుడు ఫలాలు, ఫల హారాలు తెచ్చి ఇస్తూ పంచభక్ష్య పరమాన్నాలు వండి పెట్టడానికి నౌకర్ని ఏర్పాటు చేశాడు.

పండితుడు ఇద్దరికీ ఏ మాత్రం

తీసిపోకుండా రోజంతా వృద్ధుడినే అంటిపెట్టుకుని ఉంటూ, అతడికి పురాణాలు వినిపిస్తూ, ఏవేవో కథలు వినిపిస్తూ అతడు త్వరగా కోలుకో వాలని ఆశపడసాగాడు పండితుడు.

వీరి వెంట వచ్చిన కుర్రవాడు మాత్రం ముసలాయనకి తొలిరోజే బాగా చేరువయ్యాడు. ఆప్యాయంగా ఉంటూ, కంటికి రెప్పలా సేవలు చేస్తూ వచ్చాడు.

అందరూ ఊహించినట్లే ముసలా యన త్వరలోనే కోలుకున్నాడు.

దాంతో ఆ ముగ్గురూ 'వృద్ధుడు తేరుకున్నది మా వల్లనంటే మా వల్లే' నని కీచులాడుకోవడం ప్రారంభిం చారు.

అంతా విన్న వృద్ధుడు వాళ్లను చూస్తూ పకపకా నవ్వాడు. 'మీలో ఏ ఒక్కరివల్లా నాకు నయం కాలేదు. నన్ను బ్రతికించింది ఈ కుర్రకుంక! మీలో ఒకడికి డబ్బుంది. మరొకరు పాండిత్యంలో ఘనుడు. ఇంకో వ్యక్తి వైద్యంలో ఘటికుడు. కానీ ఆ మూడూనాకు ఇప్పటికే ఉన్నాయి. నా భోషాణంలో చెప్పలేనంత ధనం ఉంది. ఒకప్పుడు నా చేతి చలవ వల్ల ఎందరో రోగులు బ్రతికి బట్టకట్టారు. నేను ఎన్నో పండిత సన్మానాలు కూడా పొందాను. కానీ వాటిలో ఏ ఒక్కటీ నా ప్రాణం నిలపలేదు. కారణం? నాకు ఆత్మీయత కరువవ్వడమే! ఈ కుర్రకుంక దాన్ని అందించి, నన్ను మామూలు మనిషిని చేశాడు. ఇక నుండి నా ఆస్థికి వారసుడు వీడే! ఇక మీరు వెళ్లిరండి. నా దృష్టిలో ఆత్మీ యత చాలా గొప్పది,' అని ఆ వృద్ధుడు తేల్చి చెప్పేసరికి, ముగ్గురు ఘటికులూ మన వాదన వలన ఇవ్వాల ఒక మంచిపని జరిగింది అనే తృప్తితో నడిచారు.





# బహుమానం

పౌర్ణమి వెన్నెట్లో తాతయ్య అప్పుడే భోజనం చేసి వచ్చి తన మామూలు వాలుకుర్చీలో కూచున్నాడు. పిల్లలు అంతకుముందే చేరి, తాతయ్య కోసం ఎదురు చూస్తున్నారు. తాతయ్య పొడుం కాయ తీసి, పొడుం వేసుకుంటూ ఒక శ్లోకం చదివాడు.

అజ్ఞా ఏవ జనాః ప్రాయో
పంచ్యంతే వంచకైః నృభిః
ప్రాజ్ఞా నజాతు వంచ్యంతే
సుమతి శ్చోలరాడిప.

'అంటే ఏంటి తాతయ్యా? ... ఇది ఇంకో కథా, తాతయ్యా? కథ చెబుతావా తాతయ్యా?' అని పిల్లలు గొడవచేశారు.

తాతయ్య తాపీగా పొడుం పట్టు పట్టి పీల్చి, 'కథ చెప్పటానికే గదర్రా, శ్లోకం చదివిందీ? ముందు శ్లోకం అర్థం ఏమిటని అడగరేం? సాధారణంగా లోకంలో ఎందరో మోసగాళ్లుంటారు గత. వాళ్లు మోసం చేసేది ఎవర్ని? తెలియని అమాయకులను! అవునా? అయితే ఒక్కోసారి తెలివిగలవాళ్ళు ఈ మోసం చేసేవాళ్లనే మోసం చేస్తుంటారు. వెనకటికి చోళదేశపు రాజైన సుమతి అనేవాడు ఇలాగే మోసగాడిని మోసం చేశాడూ అని శ్లోకం అర్థం,' అన్నాడు తాతయ్య.

'సుమతి ఎవర్ని మోసం చేశాడు, తాతయ్యా? మోసగాడెవరు తాతయ్యా,' అని పిల్లలు తలా ఒక ప్రశ్న వేశారు.

'నన్ను చెప్పనివ్వండర్రా!' అంటూ తాతయ్య ఈ కథ చెప్పాడు.

చోళదేశాన్ని సుమతి అనే రాజు పాలించేవాడు. సుమతి అంటే చాలా తెలివిగల వాడన్నమాట గద. ఆ రాజు నిజంగా తెలివి గలవాడేనూ! అంతే కాక ఈయన గొప్ప వీరుడు, గొప్ప

సి.శేషాద్రి

విద్వాంసుడు, అంతులేని దానధర్మాలు చేశాడు. ఒకనాడు సుమతి కొలువుదీరి ఉండగా ఒకడు వచ్చి, రాజుగారికి వందనం చేశాడు. 'ఏమయ్యా, నీవు ఏ విద్యలో ప్రవీణుడివి?' అని రాజు అడిగాడు.

'మహారాజా, నేను రసవేదిని, ఏ లోహాన్నయినా సరే బంగారంగా మార్చే విద్య నాకు తెలుసు. అది మా కుల విద్య,' అన్నాడు ఆ వచ్చినవాడు.

ఇటువంటి మోసగాళ్లు రసవేదులమని చెప్పుకు తిరుగుతూ, జనాన్ని మోసగించి వెండి మొదలైన లోహాలను దొంగిలించి పారిపోతూ ఉండేవాళ్లు. రాజు బుద్ధిశాలి గనుక ఈ విషయం తెలుసుకున్నాడు. వాడికి పరాభవం చెయ్యాలని కూడా ఆయన నిశ్చయించుకున్నాడు. ఆయన నౌకరును పిలిచి వాడితో రహస్యంగా ఏదో చెప్పాడు. ఆ నౌకరు అవతలికి వెళ్లి ఒక ఇనప్పెట్టె పట్టించుకొచ్చి ఈ మోసగాడికి ఇచ్చాడు.

మోసగాడు తన ఎత్తు పారిందనుకుని సంతోషించాడు. ఆ ఇనప్పెట్టె నిండా వెండీ బంగారమూ, రత్నాలూ పెట్టి రాజుగారు తనకు ఇప్పించారనుకున్నాడో ఏమో మరి! వాడు ఆశగా ఇనప్పెట్టె తెరిచి చూసేసరికి అందులో ఏమీ లేదు. వట్టి ఖాళీపెట్టె!

వాడు రాజుగారితో, 'మహారాజా, తమరు నాకేదో ఘనమైన బహుమానం ఇప్పిస్తారమని గంపెడాశతో ఇంత దూరం వస్తే నాకీ పనికిమాలిన ఖాళీ ఇనప్పెట్టె దయచేయించి అవమానించడం న్యాయమా?' అన్నాడు.

రాజుగారు, 'అదేమిటోయ్? రసవిద్య నీకు కులవిద్య అంటివి. ఏ లోహాన్నయినా బంగారం చేయగలనంటివి. ఇక నేను నీకు ఇవ్వగలిగినదేముందీ? నువ్వు తయారు చేసే బంగారం దాచుకోవడానికి ఉంటుంది గదా అని ఇనప్పెట్టె ఇప్పించాను. ఇందులో అన్యాయమేముందీ?' అన్నాడు. అందరూ గొల్లున నవ్వారు.



Log onto www.chandamama.com

# YOUR CHANDAMAMA IS AVAILABLE IN MANY AVATARS!



## Junior Chandamama

(4+ age group):

A magazine for the little ones peppered with activities, pictures, and stories that will grip their imagination!







## Regional Chandamama

Read your favourite stories in your own language! Chandamama takes you closer home even as your imagination soars!




## Chandamama English

(9+ age group)

A children's magazine that has adapted itself to the changing needs of children across decades, Chandamama English offers you a delectable mix of the classic and the contemporary in 70 pages that value fun!

Revamped
Redesigned
Relevant
Read it!

YOUR LANGUAGE,
YOUR CHANDAMAMA.

**Available in 11 languages:**

Telugu, Hindi, Marathi, Oriya, Kannada, Bengali, Tamil, Malayalam, Gujarati, Assamese, Sanskrit.

# కెరీర్ అంటే?




ఆహారాన్ని లేదా రెస్టారెంట్లను పరిశీలించి తాము కనుగొన్న ఫలితాలను ప్రచురించే వారినే ఆహార నిపుణుడు లేదా ఆహార రచయిత అంటారు.

వార్తా పత్రికలు, మేగజైన్లలోని ఫుడ్ కాలమ్‌లలో తమ అభిప్రాయాలను పంచుకునే వారిని ఫుడ్ కాలమిస్ట్‌లు అంటారు.

ఆహార సమీక్షకులు రెస్టారెంట్ల గురించి, రాస్తుంటారు. ఫాస్ట్‌ఫుడ్ సెంటర్ల నుండి విలాసవంతమైన రెస్టారెంట్లు, కేఫ్‌లు, షాపులు, ఆహార తయారీ సంస్థ లేదా ఫుడ్ అవుట్‌లెట్‌ల వరకు విస్తృత శ్రేణిలో వీరు వ్యాఖ్యానిస్తుంటారు. ఆహారం గురించి ఆలోచనాత్మకమైన, వర్ణణాత్మకమైన సమాచారాన్ని వీరు ప్రజలకు అందిస్తుంటారు. ఆహార సమీక్షకులు ఈ ఫుడ్ జాయెంట్లను సందర్శించి అక్కడి ప్రత్యేక వంటకాలను రుచిచూసి వాటిని పత్రికలు, మేగజైన్లు, ఇంటర్నెట్, టివి లేదా రేడియో ద్వారా ప్రచురించడం ద్వారా తమ అభిప్రాయాలను రాస్తుంటారు.

ఈరోజుల్లో ఇంటర్‌నెట్ రెస్టారెంట్లపై అభిప్రాయాలను తెలుపడంలో కీలకపాత్ర పోషిస్తోంది. ఈ ఉద్యోగానికి అర్హత ఏటంటే దేశీయమైన, విదేశీయమైన ఎలాంటి ఆహారాన్నయినా సరే మీరు రుచిచూసి మీ అభిప్రాయాన్ని వివరించవలసి ఉంటుంది.

ఆహారాన్ని రుచిచూడటం వల్ల మాత్రమే ఎవరూ ఆహార సమీక్షకులైపోరు. ఆహారానికి సంబంధించిన ప్రతి విషయాన్ని మీరు తెలుసుకోవాలి. వివిధ వంటకాల చరిత్రలో కొన్ని వంటలు ఎలా భాగమయ్యాయో, ఒక ప్రత్యేక వంటకంలో మసాలా దినుసులు వేటిని వాడుతున్నారో మీరు విస్తృతంగా తెలుసుకుని ఉండాలి. నిర్దిష్ట వంటకాలు ఎలా తయారు చేయబడతాయో, రెస్టారెంట్ ఎలా నిర్వహించబడుతుందో కూడా మీరు రాయగలగాలి. ఆహార సమీక్షకుడు నిజాయితీగాను, ధర్మబద్ధంగానూ ఉండాలి. విమర్శకుడు అంటే ఎల్లప్పుడూ ప్రతికూల అర్థాన్నే ధ్వనించడు. ఆహారం సరిగా లేకుంటే, ఎలా మెరుగుపర్చవచ్చు అనే అంశంపై సమీక్షకుడు తగిన సలహా ఇవ్వాలి, రెస్టారెంట్లకు సూచించాలి కూడా.

**పారితోషికం:**

తాము పనిచేస్తున్న నగరం, తమ సమీక్షలను ప్రచురించే ప్రచురణ కర్తపై ఆధారపడి ఆహార సమీక్షకులు తమ వేతనాలను ఆశించవచ్చు. జాతీయ మాస పత్రికలో ఆహార సమీక్షలు ప్రచురించే వారు స్థానిక పత్రికలలో సమీక్షించే వారికంటే ఎక్కువగా డబ్బు సంపాదించవచ్చు.

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 45

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -45అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. నవంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. జనవరి 2013 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## మహాత్మా గాంధీ



1. గాంధీజీ ఎక్కడ జన్మించాడు?
2. గాంధీజీ తల్లి పేరేమిటి?
3. గాంధీజీని మొదటి తరగతి రైలుపెట్టె నుంచి గెంటేసిన సుప్రసిద్ధ సంఘటన దక్షిణాఫ్రికాలోని ఏ నగరంలో జరిగింది?
4. గాంధీజీ అధ్యక్షత వహించిన కాంగ్రెస్ మహాసభ ఏది?
5. మనదేశంలో గాంధీజీ ఒక వార్తా పత్రికను ప్రారంభించాడు. దాని పేరేమిటి?
6. గాంధీజీ తన మొట్టమొదటి ఆశ్రమాన్ని ఎక్కడ స్థాపించాడు?
7. గాంధీజీ మనదేశంలో మొట్టమొదట సత్యాగ్రహాన్ని ఎక్కడ చేపట్టాడు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-42 సమాధానాలు:

1.చికన్ వర్క్; 2.మైసూర్; 3. పంజాబ్; 4. గుజరాత్, రాజస్థాన్; 5. ఆంధ్రప్రదేశ్; 6. ఒడిషా; 7. మహారాష్ట్ర; 8. కాంచీపురం.

*జూలై'12 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.*



# నవ్వుల పువ్వులు



వినయ్: నేనొకసారి రహదారిపై ఆడుకుంటుండగా వేగంగా వస్తున్న బైక్ ఒకటి గుద్దింది, నేను స్పృహ తప్పి పడిపోయాను.

విశాల్: అయ్యో దేవుడా! ఆ ప్రమాదం నుంచి నువు బతికి బయటపడ్డావా లేదా చనిపోయావా?

వినయ్: నాకు ఖచ్చితంగా తెలియదు. ఆ సమయంలో నా వయస్సు నాలుగేళ్లే మరి.



రెండు పాములు మాట్లాడుకుంటున్నాయి. వాటిలో ఒకటి మరొకదానివైపు తిరిగి మాట్లాడుతోంది. 'మనం విషపాములమేనా?'

మరొక పాము సమాధానమిచ్చింది. 'అవును, ఎందుకు?'

నేను ఇప్పుడే నా పెదవి కొరుక్కున్నాను మరి.



రోగి: నేను తాళం చెవి మింగేశానండీ.

డాక్టర్: ఎప్పుడు?

రోగి: నాలుగు నెలల క్రితం.

డాక్టర్: ఇంతకాలం నువ్వేం చేస్తున్నావు మరి?

రోగి: నేను నకిలీ తాళం చెవి వాడుతున్నాను. ఇప్పుడది కూడా పోయింది.

నాలుగేళ్ల పిల్లవాడు కారు వెనుక సీటులో కూర్చుని ఆపిల్ పండు తింటున్నాడు. తింటూ తింటూ, 'నాన్నా, నా ఆపిల్ ఎందుకు గోదుమరంగులోకి మారుతోంది?'



'ఎందుకంటే, నీవు దాని తోలు తీసి తింటున్నావు, ఆపిల్ పండులోని కండ గాలితో సంపర్కం చెంది ఆక్సీకరణానికి గురవుతోంది. అది ఆపిల్ అణువుల నిర్మాణంపై ప్రభావం చూపి, దాన్ని మరో రంగులోకి మార్చి వేస్తోంది,' అని నాన్న చెప్పాడు.

ఆ అబ్బాయి చాలాసేపు మౌనంగా ఉన్నాడు. తర్వాత అతడు తాపీగా అడిగాడు. 'నాన్నా, నీవు నాతో మాట్లాడుతున్నావా?'



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పద్ధాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | No I'm free now. | Have you understood? |
|---|---|---|
| Telugu | లేదు, నేను ఇప్పుడు ఖాళీగా ఉన్నాను. | నీకు అర్థమైందా? |
| Hindi | नहीं अब मेरे पास कोई काम नहीं।<br>నహీన్ అబ్ మెరె పాస్ కోయి కామ్ నహీన్. | क्या तुम समझ गए/गईं?<br>క్యా తుమ్ సమజ్ గయే/గయేన్? |
| Tamil | இல்லை, நான் இப்போது சும்மாத்தான் இருக்கிறேன்.<br>ఇల్లై, నాన్ ఇప్పోదు సుమ్మత్థాన్ ఇరుక్కిరేన్. | உனக்குப் புரிந்ததா?<br>ఉనక్కు పురిందదా? |
| Bengali | না, এখন আমার কোনও কাজ নেই।<br>నా, ఎకోన్ ఆమార్ కొనొ కాజ్ నై. | তুমি কি বুঝতে পেরেছ?<br>తుమి కి బుజ్‌తే పెరిచ్చో? |
| Marathi | मी आता मोकळीच/मोकळाच आहे.<br>మి అట మొకల/మొదలి అహె. | तुला हे समजलं का?<br>తుల సమజల్ కా? |
| Kannada | ಇಲ್ಲ, ಈಗ ನನಗೆ ಪುರುಸೊತ್ತಿದೆ.<br>ఇల్లా, నానేగ పురుసొత్తలిద్దనె. | ನಿಮಗೆ ಅರ್ಥವಾಯಿತೇ?<br>నిమగె అర్థవాయితె? |
| Odia | ମୁଁ ବର୍ତ୍ତମାନ ଖାଲି ଅଛି।<br>మున్ బర్తమాన ఖాలి అచ్చి. | ତୁମେ ବୁଝିପାରିଲ ?<br>తుమె బుజిపారిలా? |
| Gujarati | ના હવે મને ફુરસદ છે.<br>నా హవె మనె ఫురసద్ చ్చె. | શું તમે સમજી ગયા?<br>షున్ టమె సమజే గయా? |
| Assamese | নহয়, মই এতিয়া আজৰি।<br>నోహోయ్, మోయి అతియా ఆజొరి. | তুমি বুজি পালানে?<br>తుమి బుజి పాలానె. |
| Malayalam | ഇപ്പോൾ എനിക്ക് തിരക്കില്ല.<br>ఇప్పోల్ ఎనిక్కు తిరిక్కిల్లా. | നിങ്ങൾക്ക് മനസ്സിലായോ?<br>నింగలుక్కు మనస్సిలయో? |
| Sanskrit | न, अधुना व्यस्त: नास्मि।<br>నా, అధున వ్యాస్తాః నాస్మి. | अवगतं वा?<br>అవగతమ్ వా? |





| English | Have you taken notes? | It is enough for today. |
|---|---|---|
| Telugu | నీవు నోట్స్ తీసుకున్నావా? | ఈ రోజుకు ఇది చాలు. |
| Hindi | क्या तुमने नोट्स लिये?<br>క్యా తుమ్నె నోట్స్ లియె? | यह आज के लिये काफ़ी है।<br>యహ్ ఆజ్ కె లియె కాఫీ హై |
| Tamil | நீ குறிப்பு எடுத்துக் கொண்டாயா?<br>నీ కురిప్పు ఎదుత్తు కొండాయా? | இன்று இது போதும்.<br>ఇంద్రు ఇధు పోదుమ్. |
| Bengali | তুমি কি নোট নিয়েছ?<br>తుమి కి నొటె నియెచ్ఛో? | আজকের জন্য এটাই যথেষ্ট।<br>ఆజ్‌కెర్ జోన్యో ఎటాయి యథేష్టో |
| Marathi | तू मुद्दे काढलेस का?<br>తు ముద్దె కదాలేస్ కా? | आजच्यासाठी हे पुरेसं आहे.<br>అజ్‌చ్యాసతి పురెస అహె. |
| Kannada | ನೀವು ಟಿಪ್ಪಣಿ ಮಾಡಿಕೊಂಡಿರಾ?<br>నీవు టిప్పణి మాడికొండిరా? | ಇವತ್ತಿಗೆ ಇಷ್ಟು ಸಾಕು.<br>ఇవట్టిగె ఇష్టు సాకు. |
| Odia | ତୁମେ ନୋଟ୍‌ସ ନେଇଛ କି?<br>తుమె నోట్స్ నిచ్చా కి? | ଏହା ଆଜି ପାଇଁ ଯଥେଷ୍ଟ।<br>ఎహా ఆజి పాయిన్ యాతెస్టా. |
| Gujarati | તમે નોટ્સ લઈ લીધા?<br>టమె నోట్స్ లయే లేధా? | આજ માટે પૂરતું છે.<br>ఆజ్ మాటె పూరతున్ ఛె. |
| Assamese | তুমি টুকি ললানে?<br>తుమి టుకి లొలానె? | আজিৰ বাবে এয়াই যথেষ্ট।<br>ఆజిర్ బాబె ఐయాయి జథేస్తో. |
| Malayalam | നിങ്ങൾ എഴുതിയെടുത്തോ?<br>నింగళ్ ఎళుత్తియెదుతో? | ഇന്നത്തേക്ക് ഇത്ര മതി.<br>ఇన్నాతెక్కు ఇథర మతి. |
| Sanskrit | त्वया टिप्पणि: कृता वा?<br>త్వయా టిప్పనిః కృతా వా? | अद्य एतावत् पर्याप्तम्।<br>అద్య ఎతవత్ పర్యాప్తమ్. |

## ఖైదీలే ఉపాధ్యాయులు...



అతి త్వరలోనే, తీహార్ కేంద్రీయ కారాగారం లోని 3వ నంబర్ జైలులో ఉన్న వందమంది ఖైదీలు ఉపాధ్యాయులుగా మారబోరుతు న్నారు. ఢిల్లీ ప్రభుత్వం పరిధిలోని విద్యామండలి జైలులో అనియత విద్యా వ్యవస్థను రూపొందించడానికి ఒక ప్రత్యేక కార్యక్రమాన్ని నిర్వహిస్తోందని హిందూ పత్రిక పేర్కొంది. దీనికోసం అది రెండు పద్ధతులను ఉపయోగిస్తోంది. జైలులోని ఖైదీలను శిక్షకులుగా తీర్చిదిద్దడం, నిర్దిష్టమైన రీతిలో సిలబస్, పరీక్షా వ్యవస్థను ప్రవేశపెట్టడం. దీంట్లో భాగంగా ఎనిమిది మంది ప్రభుత్వ పాఠశాలల ఉపాధ్యాయులు ఈ జైలు ఖైదీలకు శిక్షణ ఇస్తారు. ఇలా శిక్షణ పొందిన ఖైదీలు ప్రాథమిక విద్యను అభ్యసిస్తున్న వయోజనులకోసం ప్రత్యేకంగా అందించబడిన మూడు ప్రీమియర్ పుస్తకాల సహాయంతో ఖైదీలు ఇతరులకు శిక్షణ ఇస్తారు. ఉన్నత తరగతులకు వెళ్లేందుకు వీరు పరీక్షలు కూడా రాయవచ్చు. ఖైదీలు విద్య నేర్చుకుంటే వారు జైలు నుంచి బయటకు వెళ్లాక అది ఉపయోగపడుతుంది. జైలు లోపల కూడా ఇది ఉపయోగరంగా ఉందని ఇప్పటికే రుజువయింది కూడా.

## అందరి జీవితాలలో వెలుగు నింపడం



రాజస్థాన్ లోని టిలోనియాలో ప్రతి అవసరానికీ సౌరశక్తిని వినియోగిస్తున్నారు. సౌర శక్తి ప్రతి గ్రామానికి కూడా విద్యుత్‌ని అందిస్తుందని బంకర్ రాయ్ అనే సామాజిక కార్యకర్త చెబుతున్నారు. సోలార్ ఫోటోవోలాటిక్ యూనిట్లను నెలకొల్పి, నిర్వహించేందుకు గ్రామీణ యువతకు శిక్షణ ఇచ్చేందుకు 29 సంవత్సరాల క్రితం దేశంలోని పలుప్రాంతాల్లో బేర్‌ఫుట్ కాలేజీలను స్థాపించారు. ఎడారి, గిరిజన అటవీ ప్రాంతం సౌర శక్తి అనేది ఎక్కడైనా విద్యుత్ వ్యవస్థలను వెలగించగలదు. రాయ్ స్థాపించిన బేర్‌ఫుట్ కాలేజ్ తిరిగి ఉపయోగించలేని శక్తివనరులకు ప్రత్యామ్నాయంగా చౌక మరియు కాలుష్య రహిత వనరులను అందిస్తుంది. ఈరోజు రాయ్ స్థాపించిన బేర్‌ఫుట్ సౌర ఇంజనీర్లు రాజస్థాన్‌ను దాటి భారత దేశమంతటా వెలుగులు నింపుతున్నాయి. టిబెట్‌తో సరిహద్దును పంచుకుంటున్న లడక్ మంచు ప్రాంతంలో కూడా ఈ సౌర శక్తి వ్యవస్తలు వెలుగు నిస్తున్నాయి.

జర్మనీలోని బెర్లిన్ నగరంలోని రెడ్ సిటీ హాలిన్ లేదా రోట్స్ రథువస్ వద్ద కొద్ది రోజుల క్రితం బంకర్ రాయ్ ఒక అవార్డును కూడా పొందారు.

CHANDAMAMA'S

# Ramayana

An Epic Journey






**Follow the epic journey of Prince Rama, from his birth to his exile, from the abduction of his wife, Sita, to his great war with the Asura King, Ravana, in Chandamama's latest offering: Ramayana - An Epic Journey.**

**Price: Rs 449/-**

**To place an order, go to www.chandamama.com**

**Chandamama's Ramayana is available only in English at all leading book shops.**

# విదూషకుడు



## బీర్బల్

# క్షురకుడి పాట్లు



1. అక్బర్ ఆస్థానంలో బీర్బల్ పట్ల ఈర్ష్య కలిగిన కొంతమంది అతడికి వ్యతిరేకంగా కుట్రపన్నారు. అతడిని నిర్మూలించడం ఎలా? వారిలో ఒకడు గొణిగాడు, నావద్ద ఒక పథకం ఉంది.



2. ఆ సభికుడు రాజ మంగలిని కలిసి తన పథకం వివరించాడు. 'ఈ డబ్బు తీసుకో. బీర్బల్ చావాలి.' అన్నాడతడు. 'అలా జరిగేలా నేను చేస్తాను' అన్నాడు మంగలి.



3. మరుసటిదినం, మంగలి, రాజుతో 'హుజూర్, మీ పూర్వీకులు స్వర్గంలో ఎలా ఉన్నారో తెలుసుకోవాలని మీకు అనిపించడం లేదా?' అక్బర్ స్పందిస్తూ అది సాధ్యమేనా అనడిగాడు.



4. 'అవును, నిప్పులలో విసిరేయడం ద్వారా బీర్బల్‌ని స్వర్గానికి పంపవచ్చు, నేను మంత్రాలు చదువుతుంటాను కనుక అతడు చావడు,' అన్నాడు మంగలి.



5. ఈ కుట్ర గురించి బీర్బల్‌కు తెలిసిపోయింది. అగ్నిగుండానికి, తన ఇంటికి మధ్య ఒక సొరంగాన్ని తవ్వాడు. 'ఇప్పుడు నేను తప్పించుకుని మంగలికి పాఠం నేర్పుతాను.'



6.బీర్బల్‌ని అగ్నిగుండంలో ఉంచారు. దాన్ని వెలిగించారు. బీర్బల్ తప్పించుకోగలిగాడు. ఇంటిలోనే నెలరోజులు గడపడంతో అతడి గడ్డం, తల పెరిగిపోయాయి.



7. రాజాస్థానంలో అతడు కనిపించగానే, అక్బర్ అడిగాడు. ఓ. తిరిగొచ్చావా? మా పూర్వీకులను అక్కడ కలిశావా? బీర్బల్ చెప్పాడు, 'అవును జహాపనా, వారికి ఒక కష్టం ఎదురైంది.'



8. ఏమిటది అన్నాడు అక్బర్. 'వారి గడ్డాలు, జుత్తు పెరిగిపోయాయి జహాపనా, మనం రాజ మంగలిని వారివద్దకు పంపిచగలమా? అన్నాడు బీర్బల్. ఎందుక్కాదు అన్నాడు అక్బర్.



9. ఇప్పుడు రాజమంగలి వంతయింది. అగ్నిగుండంలో అతడిని ఉంచి నిప్పు వెలిగించగానే బీర్బల్ మంత్రాలు చదవసాగాడు ఇంతలో మంగలి ఒక్క కేక పెట్టాడు. 'దయచేసి నన్ను క్షమించండి.'

## పుస్తకం జాడ

మీరు ఒక పుస్తకం తీసుకుని దాని వెనుక చిత్రం కేసి చూశారంటే, మీరు ISBN-80-60001-33-4 అనేలా ఒక సంఖ్య కనబడుతుంది. అది ఆ పుస్తకం చిరునామా అని చెబితే మీరు నమ్మగలరా? నమ్మండి లేదా నమ్మకపోండి. ఇది నిజం. ISBN లేదా ఇంటర్నేషనల్ స్టాండర్డ్ బుక్ నంబరింగ్ అనేది పుస్తకాలకు సంఖ్యను వేయడంలో ఉపయోగించే ఒక సంఖ్యా వ్యవస్థ.

ఒక ప్రచురణ కర్త ఒక పుస్తకానికి సంబంధించిన కొన్ని కాపీలను ప్రచురించినప్పుడు, వాటిని గుర్తించడానికి అతడు నిర్దిష్ట సంఖ్యా కోడ్‌ను ఉపయోగిస్తాడు. ఈ సంఖ్యాకోడ్‌లో దశాంశం ఉంటుంది. ఈ సంఖ్యలో తొలి భాగం ఆ పుస్తకం ప్రచురించబడిన దేశాన్ని గుర్తిస్తుంది. రెండోభాగం పబ్లిషర్ గురించి తెలుపుతుంది. మూడో బాగాన్ని టైటిల్ ఐడెంటిఫయ్యర్ అంటారు. కాగా నాలుగో భాగాన్ని చెక్ డిజిట్ అంటారు.

# వృక్షాలు

ఈనెల సంచికలో కొన్ని చెట్ల బొమ్మలతో స్క్రాప్ బుక్ తయారు చేద్దాము



నీలగిరి చెట్టు



బావోబాబ్



జామ చెట్టు



ఉసిరి చెట్టు



ఓక్ చెట్టు



పైన్ చెట్టు

